# తులసీదాసు

## ప్రకరణము





గ్రంథకర్త:

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత

సంస్కృతాంధ్ర పండిత

### మహాకవి జంధ్ల సుబ్రహ్మణ్యము



1000 ప్రతులు

ప్రథమ ముద్రణము - 1949

ద్వితీయ ముద్రణము :

పరీధావి–వసంతము

1 9 7 2

మూల్యము రు. 2–50

## ఈ ప్రకరణమునందు వచ్చు పాత్రలు :-

### — పురుషులు —

శ్రీరాముఁడు - అవతార పురుషుఁడు.

ఆత్మారాముఁడు - అక్బరు పాదుషా మంత్రి.

తులసీదాసు - ఆత్మారాముని పుత్రుఁడు.

వృద్ధుఁడు - ప్రచ్ఛన్న వేషధారి యగు హనుమంతుఁడు.

కామవర్ధనుఁడు - దాసు స్నేహితుఁడు.

మనోరంజనుఁడు - ,,

మధుకరభట్టు - గృహస్థుఁడు, కాశీపురవాసి.

నలుగురు భటులు.



### — స్త్రీలు —

సీతాదేవి.

రత్నాబాయి - ఆత్మారాముని భార్య.

మమతాదేవి - దాసు భార్య.

కనకాంగి - వేశ్య.

చిత్రి - వేశ్య చెలి.

మదవతి - మధుకరభట్టు భార్య.

దేవతా స్త్రీ.





అస్మత్పితృపాదులు
బండ్ల వేంకటసుబ్బయ్యగారు
గ్రంథకర్త

# తులసీదాసు

## ప్రకరణము

శ్రీ వైదేహీ వివాహవేళ విజయశ్రీమీఱ రాముండు స
ద్భావానంద మెలర్ప సూత్రమొగి సీతాదేవి కంఠంబునన్
శివిన్ గట్టుచు వేదమూర్తియన నెంతే నమ్మహాతత్త్వ వి
ద్యావైయాత్యము సూపు దాశరథి సత్యశ్రీలఁ జేకూర్చుతన్.

(నాంద్యంతమున ద్వితీయ సూత్రధార ప్రవేశము)

సూత్ర:- ఓహో! సభ్యులందఱును సకాలమునకే విచ్చేసినారు. నా భాగ్యమేమి? నటి యింకను రాకున్నదేమి చెప్పుమా. చీర సింగారించుకొనుసరికి పట్టము కొల్లవోయినదను సామెత స్త్రీ సామాన్యమున కన్వయించునుగదా! ఔను, అలంకరణమునందాఁడువారి కాస్థ మెండు. నటీ! అచ్చటనే యుంటివా?

నటి:- (ప్రవేశము) ఆర్యపుత్రా! వచ్చుచుంటిని. నా యాలస్యము క్షంతవ్యము.

సూత్ర:- (సదృష్టిక్షేపము) చూచితివా? మానస సరోవరమున మూఁగియున్న రాజహంసలవలె వివిధ విద్యావిశారదులగు

పండితులచే విరాజిల్లు నీ సభ చంద్రికాప్రసారమునఁ జెంగలువల కొలనివలె నీసమాగమమున నెంతో కళకళలాడుచున్నది. సుధాపానమునకై యువ్విళ్లూరుచున్న బృందారకులవలె నీ సభాస్తారు లిప్పుడు ప్రదర్శింపఁబోవు రూపక రసామృతమాస్వాదింప వేచియున్నారు.

నటి:- అట్లైన నేను శ్రీ మహావిష్ణువు దాల్చిన జగన్మోహినీ రూపమును దాల్పవలయునన్నమాట. ఆర్యా! నేనందుల కర్హురాలనా?

సూత్ర:- ప్రియసీ! అంతయు భగవంతుని దయ. ఆ మహావిష్ణువు సంకల్పించెనేని మోడులు చిగుర్చును. భోగి జోగియగును. భూలోకము స్వర్గముగా మాఱును. హింసాది దుర్గుణముల కాటపట్టైన బోయఁడు వాల్మీకియై మునిపుంగవుఁడై యాదికవియై జగత్ప్రసిద్ధి వడసెను.

నటి:- నిజము. కాని దేశము పరాధీనమైనది. మతము లుద్రిక్తములైనవి. కాలము మార్పు నాశించుచున్నది. సనాతనాధునాతన సంగీత సాహిత్య కవిత్వతత్వములు తీవ్ర విమర్శనమునకు గుఱియగుచున్నవి. వర్షాకాలమునఁ బుట్టగొడుగులవలె భావకవిత్వము రేకెత్తుచున్నది. మాతృభావను బోషించెడి మహాత్ములరుదైరి. ఇట్టి కాలమునఁ బ్రేక్షకుల కెట్లానందమొనగూర్పగలమా? యని సందేహము. మీరిప్పు డేరూపకమును బ్రదర్శింప సంకల్పించినారు?

సూత్ర:- భక్త తులసీదాసు

నటి:- హిందీలోఁ బ్రఖ్యాతమైన తులసీ రామాయణమును రచించిన మహాభక్తుని చరిత్రమేగదా?

సూత్ర:- ఔను, అమ్మహాత్ముఁ డపర వాల్మీకియని భాషావేత్త లాడుదురు. ఇంచుమించుగా వారిరువురి జీవితముల పరిణామ మొకటిగానుండుటయే యట్లనుటకుఁ గారణము.

గీ॥ తొలుత చౌర్యాది వృత్తుల - దొప్పదోఁగి
కడకు శ్రీరామ భక్తులై - కవివరులయి
వెలయు వాల్మీకి తులసిదా - సుల చరిత్ర
తత్త్వపరిణతికిన్మార్గ - దర్శకమగు.

నటి:- నాథా! మీ యూహ శ్లాఘ్యము. అచ్చటచ్చట మానవుఁడు తానే సర్వమునకుఁ గర్తనని యుబ్బులోఁత లూఁగుచు వితండవాదములను బయలుదేఱఁ దీయుచున్నప్పు డాస్తిక్యమును జూఱకొన్న భక్తుల చరిత్రములే ప్రదర్శనార్హములు. అట్టి పరమ భక్తాగ్రేసరుని పవిత్ర చరిత్రము నేకవి ప్రకరణముగ రచించెనో యా కవి నామధేయమును జన్మభూమిని గూర్చియు వినఁగోరెదను.

సూత్ర:-

శా॥ బ్రాహ్మిన్ వ్యాసుని గాళిదాసు భరతున్ - బాణుః
[మయూరాఖ్యునిన్
బ్రహ్మానందు ధనంజయున్ గొలిచి యాం - ధ్రశ్రీల నర్థిష్ఠులై
బ్రహ్మాండంబునఁ గీర్తిఁగొన్న కవులం - బ్రార్థించి శ్రీ బండ్ల సు
బ్రహ్మణ్యాఖ్యుఁడు వ్రాసె రూపకముగాఁ - బ్రోజ్జుల్ ప్రశంసింప
[ఁగన్.

ఆంధ్ర దేశమునకు మండనాయమానమగు ఒంగోలు మండలమునఁ గృష్ణానదికి సప్తయోజనములు దక్షిణముగను బూర్వ సముద్రమున కర్థయోజనము పశ్చిమముగను వెలయు మృగయాపురియే (వేటపాలెమే) వారి జన్మభూమి.

నటి:- అటులైన వారి ఖండకావ్యములు, చాటువులు, నాటకములు నాకుఁ జిరపరిచితములే సుమా?

సూత్ర:- ఆలాగా? అపప్రసక్తమనుకొనక వారికి మన మాతృ భాషమీఁద నున్న మమకారమును సూచించు పద్యమొకటి వినిపింతువా?

నటి:- చిత్తము.

సీ॥ నన్నిచోడుని యింటఁ - జిన్నిచేష్టలొనర్చి
నన్నియచేఁ బల్కు - తెన్ను దెలిసి,
తిక్కనాదుల చెంత - ధీవిశారదయయి
ప్రౌఢిమై శ్రీనాథు - పథము ద్రొక్కి,
అష్ట దిగ్గజములు - నలరింప రాయల
కాస్థాన భరతనా - ట్యంబు నెఱపి,
బట్టు సూరన్న కా - వ్య ప్రసంగములందు
ద్వ్యర్థిమై పల్కు వా - క్యార్థ మెఱిఁగి,
గీ॥ అన్నివిధముల గడిదేఱి - యున్న నేమి?
యాదరించెడి పుణ్యాత్ము - లరుదుగాన
మండువేసవి లేఁదీఁగ - మాడ్కి నవసి
దిక్కు చెడిపోయె నేఁటికి - తెలుఁగువాణి.

సూత్ర:- సంతోషము! సంతోషము!! ఇప్పటికే కాలహరణమగు చున్నది. త్వరగా వివిధ పుష్ప లతా శోభితమగు నీ వసంత ఋతువును గూర్చి గీతింతువా?

నటి:- నాథా! మీయాజ్ఞ శిరసా వహించుచున్నాను.

చ॥ చిలుకలు తోరణాల్, పసిమి - చిప్పిలు పుష్పొడి గంధమూకుల్ గా
చలువలపందిళుల్, మధుప - ఝుంకృతి మంగళవాద్యఘోష, కో

కిల రతివేదనాదములు - కేకులు సానలు, తమ్మిమైదువై
యిల నలరన్ శుభంబుగ - వనేందిర మాధవుఁ బెండ్లియాడెడున్॥

(లోపల)

"పతిమాటన్ శిరసావహించు నవలా - ప్రాణేశు పుణ్యప్రసం
గతికిం ద్రోవ. కుటుంబవార్థి తరణో - ద్యన్నౌక్తి లీలా కళా
స్థితికిన్నావ, ఫల ప్రభూత హరిభ - క్తి జ్ఞానవృక్షంబు సం
తతమున్నిల్వఁగఁ జేవ, యట్టిసతియు - న్నన్ లోటు కన్పట్టునే."

సూత్ర:- ప్రేయసీ ! సహృదయుఁడైన యాత్మారాముఁడేదియో యాత్మానందమును వెలిపుచ్చుచు వచ్చుచున్నట్లున్నది ఇఁక మనము సత్వరమేగి యనంతర కార్యక్రమమున కుపక్రమింతముః రా.

( తెఱ )



# తులసీదాసు

## ప్రథమాంకము

### ప్రథమరంగము

స్థలము - ఆత్మారాముని స్వగృహము

"పతిమాటన్ శిరసావహించు" అను పద్యమును జదువుచు

ఆత్మారాముఁడు ప్రవేశించి,—

ఆహా! జగన్నాటక సూత్రధారియైన భగవానుని లీలా విలాసము లతి విచిత్రములు తన్ను నమ్మిన మానవులకు విధివశమ్మునఁ గష్టములు ప్రాప్తించినను గంటికి ఱెప్పవలెఁ గాపాడుచుండును. ఆ రామచంద్రుని సంపూర్ణ కరుణాకటాక్షము చేతనే అక్బరుపాదుషా తన యాస్థానమున నన్ను మంత్రిగా నియమించుకొని ప్రపంచ సంబంధమైన జీవయాత్రను సుఖముగాఁ గడపఁగల మార్గముఁ జూపినాఁడు. అంతమాత్రమున గర్వమొందక ఫలభార వినమ్రమైన మ్రానివిధమున నటించుచు ధర్మసూత్రముల ననుసరించి యెవ్వారికిం గీడు రోయక భక్తిశ్రద్ధలతోఁ బరమాత్ముండగు శ్రీరాముని స్మరించుటచేతనే తేజస్వంతుఁడగు నీబిడ్డను నాకా భగవంతుఁడు ప్రసాదించినాఁడు. కావుననే వీఁడు బాల్యమునందే సకల

విద్యాపారంగతుఁడై పుంభావ సరస్వతియో యనఁ బ్రకాశిం చుచున్నాఁడు. పెండ్లి పేరంటములుగూడ జరిగిపోయినవి. నాకెన్నియో దినములనుండి తీర్థయాత్ర చేయవలయునని కోరిక కలదు. (లోనికిఁ దేఱిచూచి) రత్నాబాయీ!

రత్నా:- (ప్రవేశించి) స్వామీ! ఏమిసెలవు?

ఆత్మా:- తులసీదాసును దోడ్కొనిరమ్ము.

రత్నా:- చిత్తము (లోనికేగి తులసీదాసుతోఁ బ్రవేశించును)

ఆత్మా:- నాయనా! కూర్చుండుము. ప్రియురాలా! నేను తీర్థ యాత్ర కేగెదను. కుమారా! నీవు పాదుషాగారి యాస్థాన మున నా స్థాన మలంకరించి యుక్తియుక్తముగాఁ బనుల నెఱవేర్పుము. తొల్లిటి మహమ్మదీయ చక్రవర్తులవలెఁ గాక అక్బరు చాల ధర్మవృద్ధుఁడై కీర్తి గడించుట తెలిసిన విష యమేకదా!

గీ॥ పాప మెంచక కొందఱు - పాదుషాలు
విలయ సూర్యుని చందాన - వెలిఁగి చనఁగ
అక్బరను రాజుదయమంది - హాయిగూర
జగముఁ జల్లగఁ బాలిచె - శాంతి గొలిపె.

తుల:- పాదుషాగారి బాహుబలముచేతను, ధర్మవేత్తలరగు మీ బుద్ధికుశలతచేతను రాజ్యతంత్రము జరుగుచున్నదని మా యమ్మగారు నాతోఁ జెప్పినారు. మృదుమధురమగు కోకిల కలనాదము వినుచుండు వీనులకుఁ గాకిగోల యింపొనగూర్పన ట్లాత్మజ్ఞానదక్షులరగు మీ మహోపన్యాసముల వినుచుండు చక్రవర్తి నా చిన్ని పలుకుల కాన చేయునా? ఆసించినను రుచించునా?

ఆత్మా:- నాయనా! నీ మాట లెంత ముద్దుగానున్నవోయీ! నీ వలన సకలార్థము లెఱుఁగవలయునని పంచప్రాణములు నీ మీఁదనే నిలిపికొని తరింప నెంచుచుంటిమి. వయస్సునకంటె జ్ఞానమే ప్రధానము. సంపెంగ యాంకారమునఁ జిన్నదయ్యు

సువాసనచే సమస్త జనరంజకమై యలరారుచున్నది ఒక వేళ నీ కనుభవము లేనందున హఠాత్తుగ సమకూడు రాజ్య విషయికమైన కష్టసుఖములందు మీ తల్లిగారి యభిప్రాయమును దెలిసికొని నీ కర్తవ్యమునకు నీవు గడంగుటెంతో శ్రేయము. పాదుషాగారి యాస్థానమునకు నిన్నుం దోడ్కొని పోయి విషయమంతయు వారికి నివేదించి తీర్థయాత్రకు బయలు దేఱెదను. ప్రియసీ! జ్ఞానవతివి గావున నీకుం జెప్పవలసిన విషయములు లేవు కుమారా!

సీ. ఎదురైన స్త్రీలక - న్నెత్తి చూడక కన్న
తల్లులంచును మదిం - దలంపవయ్య
పేదసాదుల గోడు - ప్రియముమై నాలించి
వలయు సాయమ్మెల్ల - సలుపవయ్య
పెద్దలం బొడగన్నం - బేర్మి పెంపనలారం
జేరి సాంగత్యంబు - సేయవయ్య
స్వార్థమునకుం బర - మార్థము బలిసేయు
దుర్మార్గులను జూచి - తొలంగవయ్య

(లోనికరసి)

గీ. పడంతి! భావమ్ములో దిగుల్ - పడవలదు
మమత! నీవింక పశ్యాజ్ఞ - సమయమనక
శిరమునందాల్చి మెలంగుట - శ్రేయమమ్మ
శ్రీగిరీశుండు మిమ్ము ర - క్షించుగాత!

రత్నా:- (నమస్కరించును)

(దాసుతో ఆత్మారాముండు నిష్క్రమించును)

(తెఱ)

ద్వితీయ రంగము

స్థలము - వేశ్యాగృహమందలి యొక గది

కనకాంగి:- ప్రవేశించి (నిట్టూర్పుపుచ్చును)

(చెలికత్తెయగు చిత్రరేఖ లేఖం దెచ్చి యిచ్చును)

చిత్ర:- అమ్మా! అందలి విశేషము లేవి?

కన:- విశేషము లేవో నీకుఁ దెలియకుండునా? మా యమ్మ నీతో నేమి చెప్పినది?

చిత్ర:- ఇయ్యది నీచేతికిచ్చి శయనమందిర మలంకరింపుమని చెప్పినది.

కన:- మంచిది; వారు వచ్చునప్పటి కయ్యది మహా వైభవోపేత ముగా నుండవలయును.

చిత్ర:- వారిపేరేమమ్మా? నేను వినఁగూడదా?

కన:- చిత్రా! అంత తొందరెందులకే. ఈ యుత్తరము చూచు కోరాదా?

చిత్ర:- (అది చదువుకొని) ఆహా! నీ కోరినట్లు తగినవాఁడే లభించి నాఁడమ్మా.

కన:- ఔను, తగ్గపురుషుఁడు లభింపనిదే త్వరపడిన నేమి లాభము? ఎంత వెలయాండ్రై జన్మించినను రూప యౌవన విలాసము లను వమ్మొనర్చుకొనఁ గూడదని నా యభిప్రాయము. అట్లు కాదేని రోగార్తులై చెడక మానరు. భగవంతుని దయవలనఁ దులసీదాసు నా వలలోఁ బడెనా? పరులను గలలోనైనఁ దలంపను. మాయమ్మ ధనమో ధనమో యని కొట్టుకొను చున్నది. ధనమేమి శాశ్వతము. ప్రాప్తమున్నచో దానం తట నదే వచ్చును.

చిత్ర:- అమ్మా! అట్లనకుము. ఏవిధముచేనైనను ధనము గడించు టయే ప్రధానము. దాని కిదియే సమయము. ఆ విషయ మున నీవు ప్రమత్తతతో నుంటివా మీయమ్మ బగ్గన మండి పడక మానదు. అనుభవించుచుండినగాని యంతుపట్టదు లెమ్మ.

కన:- చిత్రా! విధిలేక నేనీ త్రోవఁ ద్రొక్కుచుంటినేకాని మనము గూడ నితరగృహస్థులవలెఁ బెండ్లి పేరంటములు చేసికొని సతీత్వమును గాపాడుకొనుచు భారతదేశ గౌరవమునకు దోహద మొనగూర్పఁగూడదా?

చిత్ర:- నీ వన్నియుఁ గొ్రొత్త సిద్ధాంతములమ్మా.

(తెఱలో "ఎవరది")

కన:- చూడు. చూడు. ఎవరో వచ్చుచున్నట్లున్నది. (లోనికేగును)

చిత్ర:- (ముందునకు నడచి) అయ్యా! దయసేయుఁడు.

(మిత్రులతో దాసు ప్రవేశించును)

మనో:- కనకాంగి యున్నదా?

చిత్ర:- ఉన్నది; పాలు చల్లాఱునని యిప్పుడే వంటగదిలోనికిఁ బోయినది. అమ్మా! అయ్యగారు దయచేసినారు.

కన:- (ప్రవేశించి) మంత్రివరేణ్యులు దయచేయుట మా భాగ్యమని తలంతును. అందఱు దయసేయుఁడు

కామ:- ఇంకేమి మమ్మా కూర్చుండుమందువులే మా మిత్రుఁడు మీ మిత్రుఁడయ్యెనే. ఇఁక మమ్మును దలంచునా?

తుల:- మీరట్లనుకొందురేమో. కాని బాల్యస్నేహ మెన్నటికైనను మఱపునకురాదు చిననాటి స్నేహముచేఁగదా కృష్ణుఁడు కుచేలుని గౌరవించినది.

కన:- వారు మహానుభావులు గనుక సత్యముసు గాపాడుకొనిరి. ఈ కాలమునం దందఱక్కఱతీరిన వెనుక నతనిని లెక్కసేయరు.

కామ:- మేము వెళ్ళెదము. (కనకాంగితో) వానిని జీకటిలో రానీవలదుసుమా?

కన:- మంచిది నాకుఁ జెప్పవలయునా?

తుల:- (లేచి యిరువురకు ధనమిచ్చి) మీ యిష్టమైనదాని కుపయోగించుకొనుఁడు. (మెుఁవంజవేసి) ఈ సంగతి మాయమ్మకు మాత్రము తెలియఁగూడదు.

(కామవర్ధ మనోరంజనులు నిష్క్రమింతురు)

కన:- చిత్రా! సుగంధద్రవ్యములరసి తెచ్చితివా?

చిత్ర:- అన్నియు సిద్ధముచేసి లోపలనుంచితిని. మంచిగంధములో నింపుటకుఁ బన్నీటిబుడ్డిమాత్ర నాకు రాలేదు.

కన:- అన్నియు నిటకుఁ గొని తెమ్మా.

చిత్ర:- (పళ్ళెరమునఁ దెచ్చును)

కన:- ఆ యగరువత్తులను *వెండి గులాబునకు గ్రుచ్చి వెలిగింపుము

చిత్ర:- (లోనికేగును)

కన:- నిన్నసాయంత్రము మీరిటుదయచేసినప్పుడు నేను ద్వారమున నుండి మిమ్ముఁ జూచినాను.

తుల:- ఆచూపే యింతకుఁ దెచ్చినది. అదిసరిగాని వెలయాండ్రలోఁ గూడ నస్ఖలిత బ్రిహ్మచారిణు లున్నారా?

కన:- లేకేమి?

తుల - అది నేఁతిబీరకాయవంటి మాట

కన:- అట్లనవలదు. అందులకు నేనే యిందనుకఁదార్కాణము. కాని మీరనినట్లు మాలో పెక్కుఱు ధనము ప్రధానముగఁ జూచు వారే. నా యుద్దేశ్యమదిగాదు.

చ॥ మిసమిసలాడు జవ్వనము - మేన జనించిన యంతముందుగా
విసువకతగ్గవానికయి - వేగనులన్ గమనింప లగ్గగున్
బసరములట్లు తెల్విఁ నెడఁ - బాసియు వృద్ధుని జేరఁ గూల్చికై
విస మొగిఁ దాగురీతి యని - వేమఱు నామది నున్నలించెదన్.

"అసర్ఘ మసి మాణిక్యమ్ హేమాశ్రియ మపేక్షతే" అను సూక్తి మీరెఱుంగనదియా?

తుల:- ఔను, బ్రిహ్మ తన నేర్పుచే మనోజ్ఞముగ సృజించిన మణిని బంగారముతోఁ బొదువఁడేని యతసి చాతుర్య మెందులకుఁ గాల్పనా?

కన:- కూర్చుటయే యాతని వంతుగాని యందలి ఘటనాఘుటనల కతఁడధినాథుఁడగునా?

తుల:- కనకాంగీ! ఏమంటివి ? ఎవరివిషయమో యట్లుండునుగాని మన విషయ మట్లుండునా ? ఏ సమయమున జగన్మోహన మైన నీ దివ్యసుందర విగ్రహమును బొడగంటినో యప్పుడే నాహృదయఫలకమున మన్మథుఁడను చిత్రకారుని చే నీ సంస్థా

*తీవలతోఁ తయారుచేయఁబడిన చెట్టు

విశేషము చిత్రతూలికతోఁ జిత్రింపఁబడినది. ఈనాఁడు మొదలీ భవనమే నాకు స్వర్గము. నీతోడి వినోదమే దేవతా స్త్రీలతోడి వినోదము. నీ స్మితచంద్రికాప్రసారమే నాకు సుధాపానము. నీ క్రీగంటిచూపులే నాకు నిందీవర సుమమాలికలు, ఇంతేల

మ. కలికీ! నీ సుకుమార దేహసుమము - న్గన్నంత నస్మన్మన
శ్చలదిం దిందిర మొక్కపాటున మహా - సంరంభ మేపార నీ
జిలుఁగుం బయ్యెద రేకులం దవిలి న - న్జేరంగ రాదయ్యె ని
శ్చలతన్ దానిని నిల్పఁదా విడువదా - సాధ్యంబుగా దేరికిన్.

కన:- అబ్బా! అంత పుణ్యమా? కోపపడవలదు.

మ. నయమొప్పం జరియింపఁ జూచెదరు కాంత ల్చిక్కనందాక నా
శయము ల్దీర్పఁగ బాసచేసెదరు వి - శ్వాసంబు పుట్టింతురి సం
శయముల్ వాపుదురాలు "రంభయన" వే-శ్యన్జిత్తమం దెంతురె
ప్రియముల్ పల్కుట కేమిగాని మగవా-రి న్నమ్మరా దేరికిన్.

తుల:- నీ పలుకు లన్నియుఁ దా దొంగ మైనను బొరుగును నమ్మఁడను సామెతను దలపించుచున్నవి. మీరేమి తక్కువతిన్నవారా?

చ కనపడి మేయుచుండియును - గామము దీఱక క్రొత్తదుబ్బులం
గొసరి మెసంగఁ బాలుపడు - గోవులకుంబలె వారకాంతలే
పసగల జవ్వనం బెసఁగఁ - బాల్పడఁ జూతురు కన్నగాన కే
కిసలయపాణి! నీవు గురి - గింజ తెఱంగుఁ దలంచుచుంటివే

అది నమ్మవేని యిదిగో నేను మిక్కిలి ప్రేముడిఁ జేయించుకొన్న చంద్రహారము నీ కర్పించుచున్నాను. (హారము కనకాంగి మెడలో వేయును) ఇఁక నైన నమ్మకము కుదిరినదా?

కన:- మీకున్నచో నాకు లేకుండునా? (చిత్రి తెచ్చిన పన్నీరు వాసుపైఁ జల్లును)

తుల:- చాలు, చాలు,

కన:- వినూత్నమైన యీ కస్తూరి యెంత బాగుగ గుబాళించుచున్నదో యరసితిరా? (బొట్టుపెట్టును) చిత్రీ! సున్నమేదే?

(చిత్రి తోటుప్రాటుతో సున్నము తెచ్చును) (కనకాంగి దాసున కాకులు మడిచియిచ్చును)

తుల:- నీవు వీణాగానమునం దాఁదెవేసిన చేయివఁట. నిజమగునా ?

కన:- మీదయవలనఁ గొంత నేర్చుకొన్నదానను.

తుల:- అట్లైన వీణ నలవఱుతువా?

కన:- చిత్రా! ఆవీణ నిటు తీసికొనిరా.

(చిత్రి వీణ తెచ్చును. కనకాంగి జావళీలు పాడును)

తుల:- తరుణీ!

చ. కరము మనోజ్ఞమైన తను - కాంతికిఁ దోడుగ ధాత నీకు (శ్రీ)
కరము మనోహరంబు నగు- గానకళ న్దగఁగూర్చెదో సుధా
కరమగు నీ స్వరమ్ము వినఁ-గామరుఁ డమ్ముల నేయజొచ్చె నీ
కరముల గుచ్చి మన్మథుని - గర్వమడఁపవె! ప్రేమఁ డింపవే.

కన:- చిత్రా! ఈ వీణ నాగదిలోఁ డించి వీరికి ఫలహారము సంసిద్ధము చేసి నీవింక భోజనమున కేగుము. (దాసుతో) మనమింక లోనికిఁ బోదము రండు.

[నిష్క్రమణము]



# తులసీదాసు

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

స్థలము - వేశ్యాగృహము

(దాసు ప్రవేశించి పట్టుచీరెలు బల్లపైఁ బెట్టును)

తుల:-

గీ. భోగమున నమ్మహేంద్రుని - బోలుఁగాక
మేలి ధనమున శ్రీదుని - మించుఁగాక
పూర్ణ యౌవన భాసిత - పూరుషునకు
ఇంతి కౌఁగిలి సుఖము లే - కింపదెద్ది

చిత్రా! ఏమిచేయుచుంటివే

చిత్ర:- (ప్రవేశించి) బాబులు దయచేసినారా ? నేఁడెట్లో గడప దాటినారే? ఇపుడేమి కావలయును?

తుల:- వలసిన దేమున్నది? మీ కనకాంగియే. ఎచ్చట నున్నది?

చిత్ర:- ఇప్పుడే భుజించుటకరిగినది. ఇంతలోనిన్ని హారులడిగెద రేమి? ఎచ్చటకైనను బాఱిపోయిన దనుకొన్నారా?

తుల:- నీ మొగము పాఱిపోవుటేమిటి ? నీకుఁ బ్రేమతత్వ మెట్లు తెలియును?

చిత్ర:- ఓహో! పట్టుతాబితాలు గొని తెచ్చినా రేమి?

తుల:- వానికొఱకే యిప్పుడు పోవలసివచ్చినది ఏది యిష్టమైనచో నది తీసికొనవచ్చునని జరీ పేటంచువానిని దెచ్చితిని భుజించుటైనదో లేదో చూచి యావుపాలు చల్లారినచోఁ గొంచెమిటు తెమ్ము.

చిత్ర:- చిత్తము. (లోనికేగును)

తుల:- ఎవ్వరేమైననుసరే నే నింటికిఁ బోఁగూడదు. ఆ లోకము వేఱు, ఈలోకము వేఱు.

చిత్ర:- (ప్రవేశించి పాలు చల్లార్చి యిచ్చును) చెమటపట్టినదే. (వీవనతో విసరును)

తుల:- ఆహా! హాయిగా నున్నదే.

చిత్ర:- మిమ్మొకసంగతి యడుగఁదలంచినదానను. దానికిఁ దోడుగ నట్లెశ్రద్ధగూడ వచ్చినది.

తుల:- అందువలననే కదా యాఁడువాండ్ర యడావుడికి మేర లేక యున్నది. ఏమి కోరెదవు?

చిత్ర:- మఱేమియునుగాదు. మీ దయ యున్న నేనుగూడ నలుగురితోఁ పాటు క్రొత్తచీరె కట్టుకొనవలయునని నాలుగు దినములనుండి మనవిచేయుటకు వీలుచిక్కక యూరకుంటిని.

తుల:- ఇదియా? అటులేకానిమ్ము (ధనమిచ్చి), నీ యిష్టమైన చీరఁ దెచ్చికొనుము. కనకాంగిని రమ్మనుము.

చిత్ర:- ఇప్పుడే వచ్చును. మీరు కొంచెము విశ్రమింపుఁడు.

తుల:- (లోనికేగును)

కన:- (ప్రవేశించును)

చిత్ర:- అమ్మా! చూచితివా? అయ్యగారు నీ యాన కడుగు దాఁటకుండుట. నోటిమాట నోటిలో నుండఁగనే తెచ్చి పడవేసినారు.

కన:- దీనికే నీకింతయాశ్చర్యముగానున్న మాయక్కలు దినమున కెందఱకుఁ దిరుక్షౌరము చేయుచున్నారో తెలియునా? దీని కంతటికిని మా యమ్మయే కారణము. వేశ్యావృత్తియందామెకుఁ గల యనుభవ మనుపమానము.

సీ. మేడపై నొక్కండు ♦ మెలఁత చేరువనున్నఁ
గ్రిందనొక్కని ధన ♦ మ్మందుకొనును
వాకిట నిలఁబడి ♦ వచ్చువారిని బిల్చు
దొడ్డి గుమ్మమునండి ♦ త్రోలు నొకని
ముందుగా ముద్దిచ్చి ♦ మురిపించు నొక బంటుఁ
జిన్నవానికి సాకు ♦ చెప్పి పంపుఁ
బనివడినట్లుగా ♦ బయటికిఁ జనుదెంచి
కనఁబడు జారులఁ ♦ గన్నుగీటు
గీ. ఇవ్విధంబునఁ బ్రతి దిన ♦ మెంతోమంది
బుట్టలం గొటగించి పం ♦ పు విధమరయఁ
గ త్తి లేకయే గొంతుకోయు ♦ కరణిసుమ్మ
కలికి! మాకిదపూర్వము ♦ కాదు కాదు.

ఇది యంతయుఁ జూచుచున్నఁ గలియుగ చర్యలను నాటక ప్రదర్శనమునకు మాయిల్లు రంగస్థలముగాను, మా యమ్మ సూత్రధారిణిగాను, మాయక్కలు, విటులు పాత్రధారులుగాను, విటుల స్నేహితులు ప్రేక్షకులుగా నూహింపఁ దగియున్నది. భగవంతుఁ డెప్పటికైనను మా సంఘమునకీ దుస్థితిఁ దొలఁగించునా? అంతయు నీశ్వర సంకల్పము. ఏది యెట్లున్నను మంచివారికి మంచివా రొనగూడుట మహా దుర్లభము.

చిత్ర:- అది నిజమే కాని నీయందు మాత్రము భగవంతుఁ డిన్నియు సరిగూర్చినాఁడు.

కన:- అట్లే తలఁచుచుంటిని. వారికిమాత్ర మీనాఁటి ప్రేమ చేపుండునా?

తుల:- (ప్రవేశించి) వెఱ్ఱిదానా! ఇప్పటికిని మనసును గనిపెట్టలేక పోయితివిగదా?

మ. లలనా! నిన్నెడఁబాసి యొక్కక్షణకా - లంబైన నే నోర్చుకో
గలనా? సర్వధనంబు నీకొఱకునై - కాంక్షింపకే తెచ్చి యీ
గలనే, వే యిఁక నేల చావయిన ని - క్కం బెద్దియేన్నోరుచోఁ
బులినోటం గల కండ తెచ్చి యిడనే - పూర్ణేందు బింబాననా!

కన:- (చీరలుచూచి) ఇంతకన్న నెక్కువ జల్తారుకలవి లేవా?

తుల:- కావలయుననన్న నుక్కుజరిలోఁ గలవు

కన:- అవి యెందులకు? వీనికిఁ దగిన రవికగుడ్డ లేవి?

తుల:- మఱచినాడను. రేపు చీటివ్రాసి చిత్రచేతికిచ్చినచోఁ గావలసిన రకములు తేఁగలను. చిత్రా! నాకు నిద్రవచ్చుచున్నది. ఆ శయ్యను సవరింపుము,

కన:- మంచిది. మేము కొంచెముసేపు పాచిక లాడుకొందుము.

(కనకాంగి, చిత్రయు నిష్క్రమింతురు)

[దాసు శయనించును]

(ఆత్మారాముఁ డీక్రింది పద్యమును జదువుచుఁ బ్రవేశించుచున్నాఁడు)

శా. క్షుద్రస్నేహ మొనర్చి పాపమునఁ దే - జోధర్మముల్ వాసి సౌ
భద్ర ప్రాప్తికి నిల్పుకోడి సతినిన్ - భావింప కోరా! గృహ
చ్ఛిద్రంబున్ సమకూర్ప నెంచితివి ఛీ! - ఛీ!! జన్మ మింకేలరా
నిద్రాదేవత నిన్ను వీడదఁటరా! - నీచక్రియా లోలుఁడా!

తుల:- (ఉలికిపడి లేచును)

ఆత్మా:- యౌవన మదంబునఁ గనుగాన కిట్టి చెడ్డచెట్టకుఁ బాల్పడితివా? లేక నీ పాండిత్యమంతయుఁ బడుపుఁగత్తెలకడఁ బచరింపఁ దలఁచితివా? ఇపుడు నీ నేర్చిన విద్యామహాత్వ మేమగునో తెలియునా? బూడిదలోఁ బోసిన పన్నీటివలె నిష్ఫలమగును. "మణినా భూషిత స్సర్పః కిమసౌహి నభయంకరః" అన్నట్లు గుణహీనుఁ డెన్నివిద్యలు గడించినను త్యాజ్యుఁడే యగును. ప్రజలకు నీతి బోధింపవలసిన మన కుటుంబమే యిట్టి దౌష్ట్యములకుఁ బాల్పడిన నితరుల దుర్గుణములు మాన్పుటకు నోరెత్తఁగలదా? ఇంట గెలిచి రచ్చ గెలువవలయునన్న లోకోక్తి నెఱుఁగావా? తన్నుఁ దా నెఱుఁగనివాఁడు లోక మెట్లెఱుఁగును? ఏమని యిట్టి సాహసికృత్యమునకుఁ గడంగితివో యెవ్వఁడు మార్గదర్శి యయ్యెనో తెలియకున్నది. సహవాస దోషముచేఁ గలిగినదా? మాసంగతి యట్లుండఁగా

గుణవతియు, రూపవతియు నగు నీభార్య నేమి చేయఁదలంచితివి? ఛాయవలె నీతో సంచరింపవలసిన ప్రాయములో నీ వ్రాఁత నిన్నీడ్చుకొని రాఁగా నదయమున లేచి యాబిడ్డ మొగమెల్లు చూడఁగలమయ్యా! ఇట్టి దుర్మార్గుఁడ వయ్యెదవని గ్రహింపక జ్ఞానవతియైన యా మమతను నీకుఁ గట్టిపెట్టి మేమింత పడవలసిన గతి పట్టినది. నీ తల్లివలన నీ నడతను విని మమతాదేవి మొగముఁ జూడలేక నిన్నుఁ దెగవ్రేయ నుంకించి వచ్చితిని. కాని పుత్ర వ్యామోహము దొడ్డది గానఁ బ్రతికిపోతివి. నీ భార్య నీ నామము భగవన్నామమువలె స్మరించుచున్నది రత్నమువంటి భార్యనువదలి గాజుపూస వంటి వేశ్య నేల ప్రేమించెదవు? పా! పద. (నడతురు) ఓరీ! పాపీ! మనుష్యుఁడు మరలిన లాభములేదు. మనస్సును గూడ మరలింపవలయును. నీ యాస్తి యేమియు నిచ్చట దాచిపెట్టలేదు.

గీ. యువ లనెడు తైర్థికులు వచ్చి - యుండునట్టి
ధర్మసత్రము వారకాంత - తా గృహంబు
మదన విశిఖంబులకుఁ జిక్కి - నిదుర లేని
విటులు శయనించు పఱుపగు - వేశ్యయురము.

తుల:- కనకాంగి మాత్రము నన్నే తన ప్రాణముగా (అన్యోక్తి)

ఆత్మా:- ఓహో! అదియా నీ నమ్మకము. ధన మున్నంతవఱ కట్లే కానిపించును,

చ. పలుకులు తేనెయూటలయి - భావము హాలహాల ప్రవృత్తి గా
గల వెలయాలి సమ్మెదవు - గా మృగతృష్ణను నీటి తొంకిగా
దలచెదవేమి? నిన్నొకని - దక్క మఱొక్కరిని గోరదంటివా?
పలువురు పోవుమార్గ మొక - పాంథునకే యొడిగట్టి నిల్చునే?

కనుక,

ఉ. చేసిన దేమొ చేసితివి - చేసినదానికి సిగ్గుఁ బొందుచుం
దోసిలి యొగ్గి రామునకు - దోసము వాసెదవేసి పిదలం

బాసి చరింపఁ జూడుమిఁక ప్రాణము నిల్పికొనంగ నెంచి కా
వాసియు వన్నెయుం దొలఁగు – వానిది జన్మమె? పుణ్యకర్మమే?
(నిష్క్రమింతురు) – (తెఱ)

ద్వితీయరంగము

స్థలము – ఉద్యానాశ్రమములో నొకభాగము

(ఆత్మారాముఁడు, దాసు. దాసు మిత్రులు ప్రవేశింతురు)

ఆత్మా:– నేఁడు మొదలు మీరు శ్రద్ధాభక్తులతో నుపాధ్యాయులఁ బరింపుఁడు. నా చెప్పిన నియమములకుఁ దప్పితిరేని చెఱసాలకుఁ బట్టించెదను. ఇది రమణీయమైన యుద్యానవనము. ఇందలి కుటీరమందు మీరువసింపుఁడు. ఆ యిసుకతిన్నెలపైఁ గూర్చుండి హాయిగాఁ జదువుకొనుఁడు.

తులసీదాసు:– చిత్తము.

ఆత్మా:– ఏరా! భటులారా! మీరీ పూఁదోఁటను గాపాడుటే కాక నా యాజ్ఞ లేనిదే యిందెవ్వరిని జొరనీరాదు. మఱియు స్త్రీల నీ ప్రాంతమున కేమాత్రము రానీకూడదు. తెలిసినదా? పొండు

భటులు:– చిత్తము. బాబూ! చిత్తము. (నిష్క్రమింతురు)

ఆత్మా:– విద్యార్థులారా! విద్యామహిమ మిక్కిలి ప్రశంస్యము.

చ. ఉడుగని భూషణంబు నిర – తోజ్జ్వల దీపము సర్వవేళలం
దడుగక పెట్టుతల్లి పర – మార్థపు మేడకు మెట్లదారి యె
న్నడుఁ దఱుగంగబోని నిధి – నాఁచుట కందని సొమ్ము కీర్తికిన్
దడమగు మన్కిపట్టిది గదా మన మూఁడవ నేత్రమారయన్.

కావున మన యభివృద్ధికెల్ల విద్యయే ముఖ్యకారణము. నేఁటినుండియు మీరిరువురు విజ్ఞాన సౌశీల్యవర్ధనులై జ్ఞానవర్ధనుఁడనియు సుశీలుఁడనియుఁ బేరొందుదురుగాత.

(నిష్క్రమించుచున్నాఁడు)

తుల:– (సదృష్టిక్షేపము) ఎక్కడిది దాతళుకు? అకాలమగు మెఱపాయిది? లేక ఫణామణి మెఱయ నేచేసి దివ్య సర్పమిటు

వచ్చుచున్నదా ? ఓహో ! కాదు కాదు. ఎవ్వతెయో
కాంతామణివలెనున్నది. ఇటే వచ్చుచున్నట్లున్న దే?

జ్ఞాన:- ఔను. ఈమె యెవ్వతెయోగాని యసామాన్య స్త్రీగాఁ
దోఁచుచున్నది.

(పూఁపొదలనుండి దేవతాస్త్రీ ప్రవేశించును)

దేవ:- ఈశ్వరాజ్ఞాబద్ధనై తులసీదాసును బరస్త్రీ పరాఙ్ముఖునిగాఁ
జేయవచ్చితిని, ఇయ్యది మిక్కిలి కష్టసాధ్యము, ఈతఁ
డొరులు చెప్పిన వినఁడు తనంతఁటాఁ దెలిసికొనఁడు నన్నుఁ
జూచినది మొదలు తనకుఁగూడ ననిమిషత్వము సిద్ధించెనా
యన రెప్పలార్పక చూచుచున్నవాఁడు. లౌకిక జ్ఞాన నేత్రము
గల్గియుఁ బరస్త్రీ వ్యామోహాంధకారంబునఁ జిక్కి దిక్కుఁ
దెలియని వీని యెడలఁ బ్రసన్ననై యాత్మజ్ఞానోపదేశంబను
సూర్యోదయముగావించి సరియగు మార్గమును జూపెదగాక!

తుల:- స్నేహితులారా! మనము జన్మమెత్తినది మొదలుగ నెన్నఁ
డైన నిట్టి వన్నెలాడిని గాంచినారమా? ఆహా! యేమి నా
భ్రాంతి. ఇది కలయా? నిజమా? అనన్య సామాన్య లావణ్య
వతియగు నీపుణ్యచరిత యెవ్వతెత చెపుమా? మానవ కాం
తయా? దేవకాంతయా? లేక క్షీరసాగర మథనానంతరము
విబుధులకు సుధ పంచుటకు మహావిష్ణువు దాల్చిన జగన్మో
హిన్యాకారమా? అది యును౦ గాదు. ఇంచువిలుకాఁడు
యువజను మనోధైర్యమును జలింపఁజేయ నూహించి విరిం
చిని బ్రతిఘటించి సమ్మోహనంబులగు పంచ బాణములను
జేర్చి యిమ్మెంచుఁ బోఁడిని సృజించెనా? ఇంతయేల? సమీ
పమున కేగి వృత్తాంతమును దెలిసికొందము రండు.

శుశీ:- జ్ఞానవర్ధనా! మనకిదేమి కర్మమురా? బాబో నాగుండె యదరు
చున్నది. ఈతఁడ దేవనిగఁ జూచుచున్నాఁడే! ఏమి చేయు
దము.

జ్ఞాన:- నీకింక నోటికి మాటయైన వచ్చినది. గురువుగారి యాజ్ఞ జ్ఞాప

కమునకువచ్చి నాకుఁ గాళ్ళు గడగడ వడఁకుచున్నవి. ఈమె మన చావుకొఱకే వచ్చినదా?

తుల:- సుశీలా! ఏమి మీ గుసగుసలు?

సుశీ:- మఱేమియునుగావు. ఇన్నగా నశ్రమమునకుఁ బోవుటకు.

తుల:- అంత తొందఱేమి? అదేమి యట్లు వడఁకెదవు? భయమా?

సుశీ:- ఔను.

తుల:- దేనిని జూచి?

సుశీ:- ఆ స్త్రీనిజూచి.

తుల:- వీరిగతి అలాత పిశాచ న్యాయముగ నున్నదే. అమ్మాయిలు లారా! ఏల భీతినొందెదరు? చూడుఁడు.

చ. ధరపయిఁ బాదమూఁదు యథావిధి తెప్పల నార్పఁబోదు వా
హ్వారె! మెఱుపిట్లు నిల్చెనొకో - యచ్చెరువీలలనావిలాస మా
సురగరుడోరగ ప్రముఖ - సుందరులందఱు దీనిముందరం
గిరగిరఁ ద్రిప్పనా? మదను - కేళికిఁ బిల్వమనస్సు గల్గెడిన్॥

మీరిచ్చటనే యుండుఁడు, నేను సంగతిఁ దెలిసికొనెదను

(ఆవైపునకు నడచును)

సుశీ:- అమ్మయ్యో! గురువుగారు వచ్చెడి వేళయైనది. మనకుఁగూడ శ్రీకృష్ణ జన్మస్థానము తప్పదు, మాయమ్మకు నేనొక్కడనే సుమా.

జ్ఞాన:- మాయవ్వ నేనులేనిదే భుజింపదయ్యా.

సుశీ:- మనకెందులకుగాని గురువుగారితోఁ జెప్పెదముపద.

(ఇరువురు నిష్క్రమింతురు)

తుల:- (దేవకాంతను సమీపించి)

మ. రమణీ! యెవ్వతెవీవు భీకరభటుల్ ♦ రక్షింపుచున్నందు చే
నమరుల్ సైతము రానశక్యమగు ను ♦ ద్యానంబు నీవెట్లు రా
నమెఱెం దోడును లేరు జంకవు మహా ♦ హ్లాదంబుఁ గల్పించి ది
గ్భ్రమఁ బుట్టించెను నీ హొయల్ ముదితనో ♦ ప్రత్యుత్తరంబీయవే॥

దేవ:- (ఓరకంటితోఁ జులుకు చూపు చూచుచుండును)

తుల:- నేను తులసీదాసుఁడ ఆత్మారాముని పుత్త్రుఁడను.

మ. అరవిందానన! పల్కవేమి? బహుళ ♦ జ్ఞా? యెన్నఁడుం గంటితోఁ
బురుషుం జూడవొ? నీవు దాయుకతనం ♦ బుష్పాస్త్రుఁడీ గ్యాళులై
శరముల్ గుప్పెడు నీవు నేను నొకలై ♦ సాధింతమా? లేక ము
ష్కరుఁడే యెల్లుచుం గుటీరమున దా ♦ గంబోదమా తెల్పవే?

దేవ:- ఓ ఛాందసుఁడా! మీ తండ్రిగారు బ్రహ్మవేత్తలని శాంతానంద స్వరూపులని తెలిసికొని వారివలన జ్ఞానోపదేశముఁ బొందవలయునని బహుదూరమునుండి వచ్చిన నన్నతిథి సత్కారముల గౌరవించుటకు మారుగాఁ జిత్త చాంచల్యమున నిట్టి మోహన వాక్యములను బల్కి నీ యవివేకమును వెలిబుచ్చుచుంటివా? నీగతి యెట్లుండెనో తెలియునా?

మ. భ్రమియింపం దన చుట్టుదాను గడకీ ♦ బ్రహ్మాండమెల్లం గడున్.
భ్రమియించుం దన దృష్టిమాత్రమున కే ♦ పల్మాటలిం కేల? స
క్రమమా మార్గమువీడి మోహమున న ♦ న్గాంచంగ నేనట్టులే
భ్రమతో నిన్నును జూచుచుంటినని సంభావించి యిట్లాడెదే?

తుల:- ఆత్మతత్వ శాస్త్రము నీకు బాగుగాఁ దెలియునే?

దేవ:- ఔను, పచ్చని యద్దములుగల సులోచనములను ధరించినవానికిఁ బ్రపంచమంతయుఁ బచ్చగానె కాన్పించును. పరస్త్రీ వ్యామోహమనెడి యీ పచ్చని యద్దముల సులోచనములను ద్యజించి సుజ్ఞానమను తెల్లని యద్దముల సులోచనములను ధరించినచో నున్నదున్నట్లు కాన్పించును.

తుల:- ఓహోహో! నే నేసులోచనములను దాల్పలేదే నాకిప్పుడు ప్రపంచమంతయు యథాస్థితముగా గోచరించుచున్నది. అవిగో! చెట్లు పచ్చఁగా నున్నవి. పూవులు పలురంగులు గలిగియున్నవి నీరు నిర్మలముగా నున్నది. తుమ్మెదలు నల్లఁగా నున్నవి. ఇఁక నీవన్ననో సాక్షాత్కరించిన జగన్మోహినివలె నున్నదానవు. ఐన నా మనోభ్రాంతికిఁ గారణమా? నీ సౌందర్యాతిశయమే. అందువలన నాదోషమేమియు లేదు.

ఎట్లందువా? అయస్కాంతము సమీపముననుండి లాగుకొనుటవలన సూది పరుగెత్తిపోయి దానికి హత్తుకొనుచున్నదేగాని యయస్కాంతమే లేనియెడల దానికిఁ గదలిక యుండదుగదా? తెలిసినదా?

గీ. మెఱసి మెఱయింప వచ్చిన - మించుఁ బోణి
తెలిసి తెలియని యట్టులఁ - బలికెదేల?
తళుకు బెళుకగు చూపుల - నిలిపి కలఁచి
వలచి వలపింపవే యెంత - వారినైన॥

దేవ:- ఇట్టి కోరిక నీకుఁ దగదు అబలనని తగనిపలుకులు పలికితివా తగిన బుద్ధిచెప్పి పోయెద

చ. చదివితి వేదశాస్త్రముల - సారముఁ గ్రోలితినంటివేల నీ
చదువది కాల్పనే సుగుణ - సంపద లేక పరాంగనారతిన్
హృదయము నిల్పి భూతదయ - నింతదలంపక చేయుపుణ్యముల్
చెదరక నిల్చునే కటికి - చేదు సుధాప్లుతమైన భంగిగన్॥

చదివినదానికి ఫలము సద్గతిఁ గోరుటగదా! వెఱ్ఱివాఁడా! యుత్తమ వంశంబునఁ బుట్టి యేల నీచమగు కోరికఁ గోరెదవు. ఇందువలన నీ జపతపాది క్రతువులకు భంగము వాటిల్లునుసుమా.

తుల:- మధురవాణీ! నీ వింకను కేవల మమాయిక వృత్తిలోనే యుంటివే. తామరపాకు నీటినడుమ నుండినను దడియనట్లు గాయత్రీ మంత్రోపాసనవలనఁ బవిత్రతను జెందిన మేము విషయ సుఖములు పొందినను బాప పుణ్యములు మమ్మంటఁ జాలవు. ఇందుల కుదాహరణంబుగ నార్య ప్రోక్తంబగు పద్యంబొకటి తెల్పెద వినుము.

"గారుడమంత్ర సిద్ధుఁ డుర - గంబులచేఁ గఱపించుకొన్నఁ ద
ద్ఘోర విషంబు లెక్కవట - కుంభినిలోఁ గురుమంత్రసిద్ధుఁడై
జారవినోదియై విషయ - సంగతిఁ జెందినఁ జెడుఁగాక యా
పూరిత మోహపాశములఁ - బొందఁడయా శరభాంకలింగమా!"

దేవ:- ఈపద్యమునందలి నిజమైన తత్త్వమును గ్రహింపనేరక నీవంటి

యవివేక శిఖామణులు నామమాత్రమునకే పెద్దలమని చెప్పు కొనుచు దురాచారమునకు లోఁబడుచున్నమాట వాస్తవమే దానిని సరిగా విమర్శించెద వినుము. విషయసుఖము లాయుః క్షీణము లగుటచేతను హద్దుదప్పిన పాపభూయిష్ఠములగుట చేతను విషజంతు సమానములే యగును. క్రూరజంతువులను మన మెన్ని మంత్ర తంత్రములచే లోఁబఱచుకొన్న నొకా నొక సమయమందైన హానిసేయును కావున విషయలోలు రుగానుండి ధన్యులైనవారు లేరని నమ్ముము.

తుల:- లేకేమి? పలువురను దెల్పెద వినుము.

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టి - జేయఁడయ్యెనె గాధి
పట్టి మేకను జే - పట్టుకతన?
గౌతమ మునిపత్నిఁ - గలియఁడే యింద్రుండు
స్వర్గాధికారంబు - జారెనొక్కొ?
గురుభార్య తారతోఁ - గూడడే చంద్రుండు
వానికి నేపాటి - వన్నె తగ్గె?
తులసి కౌఁగిటఁ జిక్కి - కులుకఁడే విష్ణుండు
పూజనీయుఁడుగాక - పోయెనొక్కొ?

గీ. ఉవిద! వాతాతపంబుల - కోర్చి యటవి
వాయు జల పత్ర భక్షులై - వరలు మునులు
సొగసులొలికెడి మీగాలి - సోకినంతఁ
బడరె మీవెంటఁ దపములు - పండెననుచు.

దేవ:- అబ్బా! నీ తెలివి తెల్లవాఱినట్లున్నది నీ యుదాహరణముల లోనే నా యుపమానములనుగూడఁ జూపెద. ఇంద్రుఁడు పంపిన మేనకా దర్శనంబున విశ్వామిత్రుండు ఘోర తపో భ్రష్టుండై దానిందగిలి యపత్యభిక్షపెట్ట నా యపత్యమును దన చేతికిఁబోవఁ దిరిగి పూర్వజ్ఞానము కలవాఁడై యయ్యో! నాతపంబు భంగమైపోయెఁగదా యని చింతింపుచు వారలఁ గన్నెత్తి చూడక మరలఁ దపంబు సేయ నుత్తర దిక్కున

శేగెను. తరువాత నిందు్రిని సంగతియా? శివశివా! చెప్పఁ గూడదు నిలువెల్లఁ గన్నులగునట్లు శపింపఁ బడలేదా? మూఁడవవాడు చంద్రుఁడా? వాని సంగతి ముక్కచెక్కలై నట్లే యున్నది. ఈ దినమువఱకుఁ గళంకము తప్పినదా? మహావిష్ణువే మాయా వేషమునఁ బతివ్రతా హృదయ చోరుండై పాషాణమై పోవఁడా? అట్లైన యీ పద్యము నందలియర్థము వ్యర్థము కావలయునా యనెదవేమో, కాదు లోకమున జార శబ్దము పరస్త్రీ లోలతకుఁ జెందియున్నను "జరయతి పరస్త్రీ యమిత జారః" అను వ్యుత్పత్తిచేఁ బర స్త్రీని శిథిలము చేయువాఁడు. అనఁగా విషయేతర సుఖముల నుండి శిథిలము చేయువాఁడని చెప్పవచ్చును. కాదేని వేద వేదాంగాది గ్రంథసారంబు నార్యప్రోక్తంబగు ధర్మసూత్ర ములును వ్యర్థమైపోవును. ఎట్లందువా?

"మాతృవత్పరదారేషు పరద్రవ్యాణి లోష్టవత్
ఆత్మవత్సర్వభూతేషు యః పశ్యతి సపండితః"

అనుట నీ వెఱుంగవా? నీవును బండితుఁడనని విఱ్ఱవీగుచుంటి వని నాకుఁ దెలియును. నీ పండిత బిరుదము నేతి బీరకాయ వంటిది.

తుల:- కోమలాంగీ! నన్నేల శ్రమపెట్టెదవు. అందియందని దొండ పండునకై పరితపించు చిలుకవలె నా మనంబు త్వరపడు చున్నది. ఇందువలనఁ బాపంబొనఁగూడెనేని నేను తపంబొన రించి దానిని బాపెద రమ్ము. (సమీపించును)

దేవ:- (తొలఁగి) బుద్ధిహీనుఁడా! దూరముగ నిలువుము. నీ సూ్ౘర త్వము దేవతా స్త్రీలకడ నుపయోగించినఁ దగిన శిక్ష తప్పదు పరస్త్రీని మోహించినందుచేఁ బంక్తికంఠుఁడు సర్వనాశన మొందెను. పరస్త్రీ సౌందర్యమునకు భ్రమజెంద బ్రహ్మ శిరముఁ బోగొట్టుకొనెను. పరవనితాశక్తిచే సుందోపసుందులు ప్రాణములఁ బాసిరి. పరాంగనా రతింగోరి నహుషుఁడు పద

భ్రష్టుఁడయ్యెను. పరభామను దగులుటం జంద్రుఁడు వ్యాధి గ్రస్తుఁడయ్యెను. పరకాంతను జేపట్టఁబోయి బోయఁడు భస్మమైనాఁడు. పరనారిం జెఱుపఁ దలంచి కీచకుఁడు పరలోకగతుండయ్యె. పరస్త్రీ వ్యామోహంబున సర్వనాశనమొందిన వారి సంఖ్యకుఁ బరిమితిలేదు. కావున దూరమాలోచించుకొని దూరముగఁ దొలఁగిపొమ్ము.

తుల:- నీ మాటలు నాచెవిం జొఱుటలేదు. నీతులకిది సమయము కాదు. ఒక్కసారి నా యభీష్టమును దీర్చితివేని సశరీర స్వర్గసుఖ మనుభవించెద. మదన తాపమున నా ప్రాణము లెగిరిపోవుచున్నవి. మోహారణ్య మ ధ్య ము న మన్మథ కిరాతుఁడు మర్మముల భేదించుచున్నాఁడు. నీ యధరామృత మిచ్చి రక్షింపుము. ప్రాణదానముకన్న వ్రతము కలదా? అబ్బా! భరింపఁజాల...... రమ్ము...... నా నుదువు లాలింపుము. నన్నొక్కసారి కౌఁగిలింపుము. (సమీపించును)

దేవ:- (ఆవలకునెట్టి) ఆఁ!

ఉ. మానవ జన్మమెత్తి దయ -మాలి స్వధర్మముఁ దూలి బేలవై
మానవు మానినీ హృదయ - మామరవించుట మందబుద్ధివై
మానము ప్రాణముం దొలఁగు - మార్గముగా నిది యెంచవైతివ
జ్ఞానమె జన్మకారణము - జ్ఞానము సర్వ శుభాస్పదంబిలన్

ఛీ! యిచ్చట నిలువఁ గూడదు.

(నిష్క్రమించును)

తుల:- (వెన్నంటి) సుందరీ! తగునా? తగునా? (మూర్ఛిల్లును)

ఆత్మా:- (ప్రవేశించి) ఆశ్రమంబునఁ బాలకుఁ డొక్కఁడును లేఁడే! గంగిరెద్దువలె దుస్తులను ధరించి కట్టెపెత్తనము సేయుచున్న వనపాలుర కొడలు దగ్గఱ నున్నదా? లేదు. కాదేని వీరినేల బయటికిఁ బోనిత్తురు. ఓరీ! భటులారా!

భటులు:- (ప్రవేశించి) బాబూ! దణ్ణాలండి దణ్ణాలు.

ఆత్మా:- ఛీ! మదోన్మత్తులారా! ఏరీ పాలకులు? దొంగలకుఁ దోడు

దొంగలైతిరా? ఈ కరవాలంబున మీ కంఠములు తెగనఱికిన బాగుండు. (కత్తిదూయఁబోవును)

భటులు:- (వణఁకుచు) దొరగారూ! దణ్ణాలు. అయ్యా! మామేమి సేయమంటారు. మాముండ వాకిలిగుండా ఓరు బేటికి రాలేదు. పో...ఆలో నేమన్నా తిరుగుతుండా రేమో సామీ?

నేపథ్యమున- "గురువుగారు చింతనిప్పులవలెఁ గనులెఱ్ఱ చేసినారు"

భటు:- అరుగోనండి సామీ! మామీద పడితే మామేమి చేత్తాం బాబూ!

సుశీ - జ్ఞాన:- (ప్రవేశించి) ఆచార్యా! నమస్కారములు.

ఆత్మా:- దుర్మార్గుండగు తులసీదాసెక్కడ? మీ యధ్యయన మేమయ్యెను? భటులారా? వీరిని బంధింపుఁడు.

సుశీ:- అయ్యా! మాదేమియుఁ దప్పులేదు. (వడఁకును)

ఆత్మా:- తులసీదాసెక్కడ? చెప్పుడు త్వరగా...ఊఁ?

జ్ఞాన:- మేము చదువుకొనఁ బోవుచుండఁగా మంచినీరు త్రాగుటకని తులసీదాసు కోనేటిదగ్గఱకుఁ దీసికొని పోయినాఁడు. ఇంతలో నొక స్త్రీ రాఁగా నామెతో నతఁడు మాటలాడఁబోవుచుండ మేము మీతోఁ జెప్పవచ్చితిమి.

ఆత్మా:- ఆఁ! ఏమది ? ఎవ్వరా స్త్రీ ? ఎట్లువచ్చినది ? ఉన్నదా ?

జ్ఞాన:- అప్పుడే యామె పోవుటకుద్యమింప నతఁడామె వెంటఁబడెను.

ఆత్మా:- అటులైన నా దెసకు దారి తీయుఁడు. (నడతురు)

సుశీ:- ఆచార్యా! ఇదుగో? ఈ పొదలోఁబడి సుందరీ సుందరి! యని కలవరించుచున్నాఁడు

ఆత్మా:- కొంచెము నీటితో ముఖము దుడిచి తిన్నఁగా లేవదీయుడు

(స్నేహితులు దాసును గూర్చుండఁ బెట్టుదురు)

ఆత్మా:- తులసీదాసూ! స్వస్థచిత్తుఁడ వగుము శాంతిఁ బొందుము. ఇటు వినుము. మారుని జయించిన మహేశ్వరుఁడే నిత్యయావనము గలవాఁడగుటచే మోహాంధకారము తన్ను బాధించునను భయము వలనో లేక తన్నుపాసించు భక్తుల హృద

యములందుఁ బ్రవేశించుచున్న వెఱపు చేతనో జ్ఞానప్రకాశ మను చంద్రరేఖను శిరమున ధరించినాఁడు. యౌవనాహంకార మున భ్రాంతిజెందు వారికి మన్మథుఁడె పరబ్రహ్మమనియు స్త్రీలే యుపాస్య దేవతలనియు, వారి పలుకులే వేదములనియు, శృంగార ప్రబంధములే యుపనిషత్తులనియు కొక్కోకమే వేదాంత శాస్త్రమనియు నటవిట గాయక విదూషకులే పండి తులనియుఁ దమకుఁ దోఁచినవే తార్కాణములనియు స్త్రీభోగమే రాజయోగమనియు విషయానందమే బ్రహ్మానందమనియుఁ దలంచెదరు. దీనికిఁ గారణము మదనపిశాచావేశమునఁ గలిగిన యున్మాదమే. నీదృష్టిని మరల్పఁజాలవేని మోహాగ్ని నీ శరీ రమును భస్మము చేయును.

తుల:- అబ్బా! సుందరీ! దేహము. తాపము. మృణాళమువంటి నీ కరములతో నన్నుఁ గౌగలించితివేని నా దేహము చల్లఁబడును

సుశీ:- తులసీదాసూ! గురువుగారు వచ్చిరి.

తుల:- నాగురువతనుఁడే అతఁడెట్లు వచ్చును?

జ్ఞాన:- మీ నాయనగారు వచ్చినారు. కన్నులు తెఱచి సరిగఁ గూర్చుండుము.

ఆత్మా:- కుమారా! యౌవన మను ప్రళయకాలమున వ్యామోహ మను మహావాయువు వీచుటచే సంతాపముల నెడి యుల్కా పాతములు బయలుదేఱి మానవులను హింసించును. ఆయౌవ నము వివేకవంతులు మాత్రము శ్రేయోభివృద్ధిఁ బొందఁ దగినకాలము. బాల్యమా మంచిచెడ్డలను గుర్తింపక యమాయి కత్వముగఁ బోవును. తృతీయ దశయగు కౌమారమునందు గృహస్థాశ్రమమునకు సంబంధించిన యనేక కష్టములకుఁ దల యొగ్గుచు సముద్రపుఁ గెరటములలో దొరలెడు నిమ్మపండు వోలె మునుఁగుచుం దేలుచుండును. నాల్గవదశయగు వృద్ధతలో శారీర మానసిక బలములుడిగి యెందుకుం బనికిరాని స్థితిలోఁ దనకుఁ దానే యసహ్యపడుచుం దిన్నగ దాఁటిపోవుట కెదురు

చూచుచుండును. కావున యౌవన మొక్కటియే దేహమును రాత్రికిఁ బూర్ణ చంద్రుఁడు. మనస్సనెడి పక్షికి ఱెక్కలు. జీవయాత్రానదికిఁ బూర్ణ ప్రవాహము ఇంద్రియ చకోరములకు జ్యోత్స్న. శారీర మానసిక శక్తులనెడి వృక్షములకు వసంతఋతువు. అట్టి యౌవనము నేల పాడుచేసికొనెదవు? ఇప్పుడు నీ మనస్సెంత విచారగ్రస్తమైయున్నదో నీకొఱకై నీ భార్యయగు మమతాదేవి స్థితిగూడ నిట్లే యున్నదని యెఱుంగుము. శాంతముతో నొక్కసారి భగవంతుని ధ్యానింపుము.

తుల:- (మౌనముతోఁ గూర్చుండును)

ఆత్మ:- వీని మనం బేమియు మాఱలేదు. ఓ పరమేశ్వరా! నా కుమారున కిట్టి బుద్ధి నేల ప్రసాదించితివి? మదన తాపమున వీఁడు రేపో మాపో ప్రాణములు విడుచును. అందువలన మా వంశాంకురము నశించును. ఓ పురుషోత్తమా! నీ దయవలన దేవకాంతను మఱియొక మాఱు టకు రప్పించితి వేని మదీయేంద్రజాలవిద్యచే నామె శరీరమునందలి రక్తమునోడ్చి యస్థిపంజరము వీనికిఁ జూపినచో నసహ్యపడక మానఁడు. దాన వీని మనంబు మాఱునేమో.

(రక్తహీన మైన దేవకాంతయొక్క యస్థిపంజరము కనఁబడును)

సుశీ:- తులసీదాసూ! అదిగో! దేవకాంత వచ్చినది.

తుల:- (కన్నులు తెఱచి) ఏదీ? ఎక్కడ? ధన్యుఁడను. కృతార్థుఁడను.

ఆత్మ:- ఇంతకుమున్ను నీవు చూచిన కాంతామణి యీమెయే యగునా?

తుల:- ఔను...... ఛీ! ఇట్లున్న దేమి?

ఆత్మ:- దీనికేగదా? చేతఁ జిక్కిన పెన్నిధిం బోగొట్టుకొనిన పేద చందమున విలపించితివి. పాఠకులారా! ఇంటికిబయలుదేఱుఁడు.

(నిష్క్రమించుచున్నాఁడు)

తుల:- విధి...... అలంఘ్యము.

చ. అరయఁగ వంశ వృద్ధికయి ♦ యాలిని బెండిలియాడి కండ కా
వరమునఁ గన్నుఁ గానక కృ♦పా రహితాత్ముఁడనై చరించితిన్
స్థిరమిది యన్యకాంతలను ♦ జేరను సత్యము బుద్ధివచ్చె మ
ద్విరహము చేనుగా వగచి ♦ బీటిని మేసిన చందమయ్యెడిన్.

[నిష్క్రమింతురు]

తృతీయరంగము

స్థలము - దాసు గృహము

మమ:- ( భర్తృ ప్రతిమను బుష్పహారముచే నలంకరించుచు )
భర్తృ పాదసేవకై పరితపించినా నా జన్మమున కిప్పుడుగదా
తగినంత యవకాశము చిక్కినది

సీ. పతిపాద జలముల - భక్తితోఁ దలఁ దాల్ప
నఖిల తీర్థస్నాన - మాడినట్లు
నాథుని కొకమాఱు - నమత మ్రొక్కిన
మూర్తి త్రయమునకు - మ్రొక్కినట్లు
ధవునకుఁ బ్రీతి ప్ర - దక్షిణ సేసిన
జగతీ ప్రదక్షిణ - సలిపినట్లు
ప్రియుని మనంబును - బ్రేమ నాకర్షింప
నమరవరులు వశ్య - లైనయట్లు

గీ. భర్త నానందమునఁ దేల్చు - ప్రతిభయున్న
నిజము మోక్షము నఱచేత - నిలిపినట్లు
వేదవేదాంగములనెల్ల - వెదకి చూడ
సతికిఁ బతిసేవకంటె స - ద్గతియుఁ గలదె?

రత్నా:- ( ప్రవేశించి ) మమతా! మంచి ధోరణిలోనె యున్న
దానవు. కాని,

ఉ. పెద్దలు చిన్నలంచుఁ గని - పెట్టి చరింపఁగ వల్లదమ్మ! యే
ప్రొద్దును గామలోలతఁ - బ్రొద్దులుపుచ్చుటఁ గూడదమ్మ మీ
యిద్దఱి యా రహస్యమిఁక - యెవ్వతెయే వినఁగూడదమ్మ బ
ల్నిద్దపుఁ జెయ్దముల్ సతుల - నీతికి లేత గదమ్మ యారయన్.

మమ:- (వినయముతో) సత్యము.

రత్నా:- కావున యుక్తాయుక్తములను గమనించి ప్రవర్తించుట శ్రేయము.

చ. విరులకు మార్దవంబు, కటివేపకు వాసన, పుట్టతేనెకున్
సరియగు తీపి, తీఁగలకు సాగెడి శక్తియు నల్లత్రాటికిం
బరువము, మౌక్తికంబునకు భాసమదెట్టులొ యట్లెజన్మతో
నరులకుఁగూడఁ గల్గును గుణంబులు వానిని మాన్పశక్యమే?

దేవతార్చనకు వేళయైనది. (లోనికేగును)

మమ:—మాయానందమునకీ యుపనిబంధనలు సరిహద్దులు. ఔచిత్యము తొలఁగినఁగదా రసాభాసమగును. కోదండ్రి జీవయాత్ర కత్తిపై సాముపంటిది.

తుల:-(ప్రవేశించి) ప్రియసీ!

మమ:- దాసురాలి కేమి సెలవు?

తుల:- ఏది నీ హస్తము నిటు చూపుము. సాముద్రిక శాస్త్రము యొక్క నిశ్చయ మెంతవఱకాయని పరిశోధన చేయుచున్నాఁడను. జీవితాంతమువఱకు మనకీ యైశ్వర్యమిట్లే యుండునా?

మమ:-మీరు రాజును గావలయు ననుకొనుచున్నారా?

తుల:-లేదు. లేదు.

మమ:— మీకు లేకున్నను మహారాజ యోగము మీకు సిద్ధించునేమో? ఈ రేఖలున్నవి మాసిపోవుటయు లేనివి పెట్టుటయుఁ గలదుగదా. అయిన నేనావిషయ మంతగా గణింపను. కాని మీరు నాయందు సంపూర్ణ ప్రేమను గలిగియుండుటే నాకు సంతోషము.

తుల:- మంచిది, ఔను.

కం॥ సతికిని బతిపై నైనను
బతికిని సతిపైనఁగాని వలపగు నెందుక
సతి పతు లతులిత ముదమున
సతతము సమమౌట జన్మ సాఫల్యమగున్.

మమ:- నిన్న నేనడిగిన మాట కేమి సెలవిచ్చెదరు?

తుల:- ఏమది?

మమ:- మరలఁ జెప్పుమనెదరా? మా యమ్మగారింటికి వెళ్ళవల యునని.

తుల:- ఏమి నీ తొందర! ఇప్పుడే వెళ్ళవలయునా? కావలసినన్ని పండువులు వచ్చుచున్నవి. అప్పుడు వెళ్ళి నాల్గు దినములుండ వచ్చును.

మమ:- మీరాకల్లై యుండును గాని యాఁడు పుట్టువు బుట్టిన ప్రతి వ్యక్తికిఁ బుట్టినింటిపై భ్రాంతి గలుగుట సహజము. దాక్షా యణీసైతము తన్నుఁ బిలువకపోయినను బుట్టినిల్లనెడి ప్రేమతోఁగదా యజ్ఞమున కరిగినది అది యేవిచిత్రమో గాని యచ్చటి గంజియుఁ బరమాన్నమువలె రుచించును.

తుల:- సరియే కాని. సతీ! ఈప్రపంచమునకుఁ గారణభూతమైన దేది

మమ:— (యోచించి) భ్రాంతి.

తుల:- సూర్యచంద్రాదులాకాశమునఁ బ్రకాశించుట కాధారమెద్ది?

మమ:— సత్యము.

తుల:- దేనిని దెలిసికొనిన నన్నియుఁ దెలిసినవాడగును?

మమ:- పరమాత్మను దెలిసికొనిన నన్నియుఁ దెలిసినవాఁడగును.

తుల:- (నవ్వి) నీ సమాధానములకు సంతసించితి. ఒక్కమాటు ముద్దిమ్ము.

మమ:- కేవల మేకాంతము కానందులకు క్షమింపవలయు? మీరు కవీశ్వరులుగదా? నేనొక సమస్య నిచ్చెద పూర్తి చేయుదురా?

తుల:— తప్పక.

మమ:— (యోచించి)

వరుని సహింపనోపరు కృపా పరతంత్రి లోకప్పుడేనియున్

తుల:- ఏమది? "వరుని సహింపనోపరు కృపా పరతంత్రి లోక ప్పుడేనియున్" అనఁగా భర్తనుదయఁగలస్త్రీలు సహింపరా?

ఇది యేమి చిత్రము. ఓహో! నా మెడకే తెచ్చితివా? కానిమ్ము. నీ యభిప్రాయమున కనుగుణముగనే పూర్తి చేసెదను.

చ. సరస రసజ్ఞ సద్గుణ వి - శారద శారదవంటి భార్య మం
దిరమున నుండఁగా వలపు - దీరఁగఁ గ్రీడలఁ దేలలేక దు
ష్కరుఁడయి కాలమెల్ల పర - కాంతకునై పఱతెంచునట్టి యా
వరుని సహింపనోపరు కృ - పా పరతంత్రలోకపావనియుః॥

మమ:- చక్కఁగాఁ బూర్తిచేసితివి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నదానను. (పుస్తకము దెఱచును)

తుల:- ఆ గ్రంథము భారతమా?

మమ:- కాదు. రామాయణము. నిన్నటి దినము రామ రావణ యుద్ధము పూర్తియైనది. నేఁడు రామ పట్టాభిషేకమువఱకుఁ జదువవలయును.

తుల:- మంచిది. అట్లైన శ్రవణానందముగఁ గానిమ్ము.

మమ:- అంత రఘుకుల వార్థి సోముండగు రాముండట్లు.

నేపథ్యమున:- "ఆర్యా! పాదుషాగారు దయచేసినారు"

తుల:- ఆగుము. మరల వచ్చెద. (పోఁబోయి యాగి) ఢిల్లీకిఁ బోయినచోఁ బాదుషాగారు పది దినముల వఱకు రానీఁడు. పదిదినములు కాదుగదా పది నిముసము లీమెను వదలియుండుటన్నఁ బది యుగంబులుగా నున్నది. కడచినసారి యెట్లులో తాతగారి తద్దినమని చెప్పి తప్పించుకొంటిని. ఈతఁడే మఱి యొక సాకుచెప్పి సాగనంపెద. ప్రేయసీ! నాకుఁ గొంచె మస్వస్థతగా నున్నదనియు నారోగ్యముగా నున్న తత్క్షణమే వెళ్ళెదననియు మా యమ్మగారితోఁ జెప్పుదును. మిక్కిలి యవసరమైన పనియైనచో ఢిల్లీకి వెళ్ళి త్వరగా వచ్చెద.

[లోనికేగుదురు]

(తెఱ వ్రాలును)

# తులసీదాసు

## తృతీయాంకము

### ప్రథమరంగము

స్థలము – కాశీ పట్టణములో నొకగృహము

మధుకరభట్టు:– (ప్రవేశించి) అదిగో నేననుకొనినిట్లేయైనది. మతిలో నెంతో గతిలోనంత. తలుపు దగ్గఱకువేసియే పోయినది ఇస్. అబ్బా! తిరిగి తిరిగి కాళ్ళు లాగికొని పోవుచున్నవి. ఎండపడిన కొలఁది తిరుగలేని యవస్థ యొకటి. పైగా నిది యింటియొద్ద సరిగా నున్నదో లేదో యని దిగులు. రెండవది నాజన్మమంతయు నిట్లే పోవుచున్నది. చేసిన కర్మము చెంతనుండఁగాఁ గాశికిఁ బోయినఁ దీరునా? యనినట్లే కాశీపట్టణములోఁ బుట్టి పెఱిగి యింతవాఁడ నైనను నాకర్మము తీరలేదుగదా! నాకీ భార్య యెందులకు దొఱికినదోగాని నా యెముక లేరుకొని తినుచున్నది. ఉషే!... ఉషే!! దీని శ్మశాన మెచ్చట నేర్పఱచికొనినదియు నంతులేదే. జయలక్ష్మి! జయలక్ష్మి!!

తెఱలో:– ఏమండీ తాతగారూ!

మధు:– ఇది మీ యింటికేమైనఁ జచ్చినదా?

తెఱలో:– లేదండీ.

మధు:– ఇక నేనరువలేనురా బాబూ! ఇలా కూలబడతాను.

మదవతి:- (ప్రవేశించి) ఏమట్లు గొంతుక పగులులాగున నూరిపెట్ట అచుచున్నావు. నే చచ్చిన వెనుక నీవు శిలవైచుకొని శాశ్వతముగా నుండెదవా?

మధుక:- ఈపాపిష్ఠపు కొంపలో దొంగలైనను పడలేదే? ఏయాడుది యింతసేపు పెత్తనములు చేసి వచ్చుచున్నదో చెప్పవే? ఎండకు గాలికి తిరిగితిరిగి వచ్చువాడనని యింత భయభక్తులు లేక యిష్టము వచ్చినట్లు పాటుపడుచున్నదానవు. నేను యాయవారమెత్తియో యాచించియో తెచ్చి పెట్టుచుండగా తెగదిని పొరుగిండ్లను మరగినదానవా?

మద:- అదిగో! ఆమాటకే బుద్ధిచెప్పించెద. నీవు తెచ్చు మూటలకు బొరుగిండ్లకు పోకుండ జరుగుతుంది. ఇంకా నలుగురితో పాటుగ నున్నట్లయిన నీశకము మండించువాడవే. నూతల బొబ్బలేగాని కుప్పలో గింజలు లేవనినట్లూరక యఱచుటే కాని యింకేమున్నది? ఒక యబ్బ యమ్మకు పుట్టినదానను గాన చేసికొన్నందుకు కాచిపోయక తప్పదని వచ్చుసరికి వేడి వేడి పొంగు మొగాన ద్రోర్లించుచున్నదానను. చచ్చినను సాంబ్రాణికి లేని యీకొంపలో నింకొక తెర్లైన నిప్పుపెట్టెడిది.

మధుక:- ఛీ! ఛీ!! నోటికింత హద్దాపు లేకుండనున్నదే. నీకంటె మగనిని లెక్కసేయని యాడుది యీ కాశీపట్టణము మొత్తము మీద నున్నదటే అన్నమునకు వస్త్రమునకు నీకేమి తక్కువ చేసితినే. నీకిప్పుడేమి పనియుండి యింతసేపెక్కడ నుంటివో ముందు చెప్పవే పక్షీ!

మద:- ఎందుకలా చీవాట్లు కొట్టుకొనెదవు? నాకేమి నగలా? నాణెములా? దాసీవాండ్రా? గీసీవాండ్రా? మేడలా? మిద్దెలా? ఏమిచూచుకొని పొంగను? ఇంత వ్రాసిపెట్టుకదా యని ప్రొద్దున లేచినది మొదలు చేసిచేసి వంట తగులబెట్టిన తరువాత రాజ్యలక్ష్మిగారింటికి పోయి యలా కూర్చున్నాను. ఇంతలో నామె కుమార్తె కార్యముసంగతి చెప్పుచున్నది. ఇంతలో నీపాడు కేక వినబడినది.

మధుక:- ఉషే! మాయలాడీ! నేనుచచ్చే గంటసేపు కావచ్చినదే. ఎన్ని టక్కులున్న వే. ఎక్కడికో పోయినదట. ఎవరో కార్య మన్నారట తన కార్యము చేసికొని వచ్చినదట.

మద:- (బుగ్గలు పొడవ నుంకించి) నన్ను చూచిన నీ కన్నులలో నింత చింతనిప్పులు పోసికొన్నట్లుండుట యెందుకు? పెట్టకే నంటే దేవుడాయని వెళ్ళిపోయెదనే.

మధుక:- పోకయేమే. నీకు తోడు లేకపోయినగా ఛీ! నీ మొగము చూడరాదు. పో. పొమ్మి. (మీందకుం బోవును)

మద:- పోక నిన్ను కలుచుకొని యుండనులే ఎందుకలా పైకి వచ్చెదవు (బుగ్గలు పొడిచి) ఏనాడో వ్రాియబట్టి నీ యెదాన బడ్డాను.

మధుక:- (ఊతకఱ్ఱతోంగొట్టి) అంత చేతులు పొడుగుగానున్న వషే నానాపాట్లు పడుటకు నాపాల బడినదానవషే. చావు. పక్షీ!

మద:- (ఏడ్చుచు) అయ్యో! దైవమా! నేనీ పోరు పడలేనురా. చేతినున్న గాజులుగూడ వీని మొగాన పెట్టుకున్నాండు. (ఏడ్చును)

మధు:- నీతో నేనిక చేయలేను. వెళ్ళిపోయెదవా లేదా? ఉషే.

ఉ. ఆకలి మందుచుండె నిక - నాగను నేనెటులైనగాని నా
పోకడలెల్ల మూలబడె - భుక్తికి వేళ యతిక్రమించె పెన్
డాకను జూపి యింతటి హా - డావుడి చేసెదులెమ్ము పొమ్మి నీ
పోకలు సాగవింక తెగి - పోయిన గాలిపటంబు రీతిగా,

నాకు వేదాంతముతప్ప శరణ్యము లేదు. (నిష్క్రమించుచున్నాండు)

(తెఱ వ్రాలును)

## ద్వితీయరంగము

స్థలము - దాసు తన మామగారింటికిం బోవుదారి

తుల:- (ప్రవేశించి) నే నింటికడనుండి బయలుదేఱుతటి నాకసమునం జుక్కలు కిక్కిరిసి చక్కంగం బ్రకాశింపుచుండెనే ఇంతలో నెక్కడనుండి వచ్చినదీ మేఘము. బ్రహ్మాండము నంతయుం

గ్రిమ్మివైచినదే ఈ కృష్ణపక్ష నిశీథినీ సమయమునఁ గీకాండముగఁ జెట్లు క్రిమ్మిన నిమ్మహారణ్య మార్గం బంధకారబంధురమై యుండఁ గాఱు మబ్బులుఁగూడ గ్రమ్మినవే. ఉహుహూ! చలిగాలికి శరీరము పుల్లగిల్లుచున్నది. జల్లు ప్రారంభమైనది. ఆహా! వర్షము......కుంభవర్షము.

చ. నలిగాడ్పుల్ చెలరేగి యుయ్యిమని వీ - వంజొచ్చె మేఘంబులు
జ్వాల విద్యుతులఁ గూడి క్రమ్మె దివి వ - ర్షంభింత వేగంబశ
జ్జలగారించిన భంగినుండె నిట నీ - యమ్మల్ భయంబూన్చు నీ
యిలకోడు ద్రోదసేయఁ జొచ్చినవి నేనెట్లేగెదన్ దైవమా!

(నడచి నదిలోదిగి) ఇచ్చట నీరు లోతుగానున్నదే ఎద్దియేని నిమ్న ప్రదేశము కాదుగదా? ఆహా! ఏమి మెఱపు! మఱచితి నది యీ వర్షమునకుఁ బూర్ణముగఁ బ్రవహించుచున్నది. ఈ గండము గడచుటెట్లు? దాటి తప్పలేదుగదా? ఇది రేవే యైనచోఁ బడవ లేమైనవి? నావికులా యొడ్డుననిలిపి చలిగాలికి నిలువలేక యిండ్లకేగి యుండవచ్చు దీని నెట్లు దాటఁగలను? దైవమా! ఇంతదూరమురప్పించి తిరిగి పంపించెదవా? ఏమైన నగుఁగాక. తిరిగి పోఁజాల. (పఱికించి) గ్రుడ్డిలో మెల్లయనునట్లీ మెఱపుల వెలుఁగు నాకు సాయమగుచున్నది. అదిగో! నల్లనికొయ్యవలె నేదియో కొట్టుకొని వచ్చుచున్నది. అమర్చిన కాటిబొంగై యుండవచ్చు. దీని సాయమున నావలి యొడ్డు చేరెదను. (నదిదాటి మమతాదేవి సౌధముయొక్క తలుపుఁదట్టుచు) మమతా! మమతా! తలుపుఁదీయవే ఒక్కరును బలుకలేదే! మేడచుట్టుఁ దిరిగి కేకలుపెట్టియుంటిని. ఎవ్వరికిని వినఁబడలేదు. ఈ గాలివాన మ్రోఁతవలన వినఁబడదు. చలిగాలికిఁ దలవాయుచున్నది. అబ్బా! యీ దినముననే యిట్టి వాన సంప్రాప్తమైనదే. చేతులు కాళ్ళు వంకరలుపోవుచున్నవి. ఇఁక వీరు తలుపుఁదీయరు. మేడయొక్క గుబ్బలనుగాని, యంచులనుగాని పట్టుకొనిఁ పై కెక్కుటకు

బ్రయత్నించెద. వర్షమునకుఁ దడియుట చేఁబట్టుదొఱకుట లేదు.
హా! వైకుంఠవాసా!

గీ. జాతి పడనుంటి నిటఁ బడి - చత్తునేమొ
పాహిమాం దీనరక్షణ - పాహి యంటి

(త్రాడు చేతికి దొఱకును)

నాహహాహా! నా చేతఁ జిక్కెన - దొరకెఁ ద్రాడు
పోవఁగలవాఁడ మేడపైఁ - బొలఁతిఁ గూడ.

(మమతాదేవి నిద్రించుచున్న గదిలోనికి దూకును)

తుల:- ప్రేయసీ! ప్రేయసీ!!

మమ:- (దిగ్గున లేచి యటు నిటు చూచుచుండును)

తుల:- యేమిది? దిగ్భ్రమ చెందుచున్నదానవు. రమ్మా-
(కౌగలించుకొనఁబోవును)

మమ:- మనోహరా! ఏమి మీ వేగిరపాటు. తడిబట్టలు. ఆగుఁడు.

తుల:- ఆఁగజాల నీయధర సుధారసపానంబున నానందము నొందెద.

మమ:- నాథా! ఇంత విపరీత మెందైనఁ గలదా? వర్షములో దడసి దడసి వచ్చితిరి. లోనికేగి పొడిబట్టలు కట్టుకొని రండుఁ.

తుల:- (లోనికేగును)

మమ:- ఓ పరమేశ్వరా! నాపతి కిట్టి మితిలేని కామవికారము నేల కల్పించితివి? ఇది యంతయు నీ లీలావిలాసమగుటచే నేనేమి చేయఁగలను? నా మగని మనమును సన్మార్గమునకుఁ ద్రిప్పుము, నన్ను ధన్యురాలను జేయుము.

తుల:- (పొడిబట్టలతోఁ బ్రవేశించుచున్నాఁడు)

మమ:- జీవితేశ్వరా! ఈ యర్ధరాత్రమున నీ ఘోర వర్షములో నింతదూర మెట్లువచ్చితిరి? ఈ మేడ నెట్లెక్కితిరి?

తుల:- క్రిందికి వ్రేలాడుచున్న మోకువంటి యొక త్రాటిసాయమున

మమ:- త్రాడా? అచ్చటఁ ద్రాడు లేదే. చూచెదము రండు.

తుల:- మదనతాపము నెఱుంగ లేవుకదా?

మమ:- క్షమింపుఁడు భగవంతునిలీలావిలాసంబు లాత్మానుభవంబున నర్థము చేసికొనుటకు మిమ్ము శ్రమపెట్టుచుంటిని.

(మేడ పైకెక్కుట కు వత్తురు)

తుల:- ఇదిగో యిచ్చట కెక్కి యీ త్రాడు పట్టుకొని......

(పాము పడగవిప్పి ఆడును. దాసీవలకు వచ్చును)

మమ:- నాథా! నాథా!! అపాయమా? దగ్గఱకు వెళ్ళితిరే. చేతిని చూడనిండు. (పతి చేతిని జూచుచు) ఇటురండు.

తుల:- అది యేమియును జేయలేదు. ఐన నిదేమి చిత్రము

మమ:- అమ్మయ్యో! త్రాచు. పడగవిప్పి యాడుచున్నది. ఓరీ సేవకులారా! సర్పమురా!

(సర్పమును సేవకులు తీసుకొనిపోవుదురు)

తుల:- మెత్తగా నుండుటచే దాడే యనుకొంటిని.

మమ:- (ముంగుకలుదువ్వుచు) మనోహరా! కామమునకు గన్నులు లేవన్నమాట వాస్తవమేకదా? ఇంతటి యపాయ మెందైన గలదా? నాపైని మోహముచేతగదా ఇంతదూరము నది యని నిధియని కానయని కోనయని ఘోరసర్పమని తలంపక వచ్చియుంటిరి. అశాశ్వతమై దుర్గంధ భూయిష్ఠమైన యీ చర్మభస్త్రికగా ప్రాణావాయమునుగూడ బరిగణింపకుంటిరి. ఔరా! మన్మథా! నీ మాయా మోహ జాలమును బన్ని మల్లోకముల నల్లకల్లోలముగ జేయుచుంటివే. జీవితేశ్వరా! నాయందు మీకు గలిగిన యీ వ్యామోహ మీ ప్రేమ యీకోరిక జగన్నాటక సూత్రధారియై శాశ్వత మోక్ష దాతయై భక్త రక్షణ దీక్షాదక్షుండై నాకాద్వైకుంఠ వాసుం డగు నా శ్రీ రామచంద్రుని యందుంచితిరేని మనము ధన్యు లముగదా.

తుల:- (వినయముగ చెవియొగ్గి) మమతా! ఏమంటివి?

మమ:- నాకాద్వైకుంఠ వాసుండగు నా శ్రీరామ చంద్రునియం దుంచితిరేని మనము ధన్యులముగదా యని.

తుల:- (కనులు మూసికొని) శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః... నాకాద్వైకుంఠ వాసుండగు శ్రీరామచంద్రుని యందుంచితి

మేని మనము ధన్యులముకదా ! మమతా ! ధన్యుఁడను. ఏమి నా భాగ్యము?

మ. పతిమాట శిరసావహించు నవలా – ప్రాణేశు పుణ్యాంక స
ద్గతికిం ద్రోవ కుటుంబవార్ధి తరణో – ద్యద్భవ్య లీలాకళా
స్థితికిన్నావ. ఫలానుభూత హరిభ – క్తిజ్ఞానవృక్షంబు సం
తతమున్నిల్వఁగఁ జేవ, యట్టిసతినో౦ – దర్శ లోటుగాన్పించునే.

నీవే నాకు గురువు. నీకు నమస్కారము రామ మంత్రోపదేశము చేసిన పుణ్యాత్మురాలవు. నాపాలిటి యదృష్టదేవతవు.

మమ:– నాథా! ఇది యెచ్చటి ధర్మము నీవిట్లనవచ్చునా ? నమస్కారమా?

తుల:– మమతా! భగవంతుఁడు (శ్రీ) రామావతార రూపంబున దర్శనమిచ్చు సదుపాయము చెప్పుము.

మమ:– మేయఁ బోవ మెడకుఁ జుట్టుకొనిన చందమగునా ? ఆర్య పుత్రా! లోని కేగుదమా?

తుల:– అచ్చట (శ్రీ) రామచంద్రుని దర్శనమగునా?

మమ:– ఇది యంతయు విష్ణు మాయగా నున్నది. నాథా! కనులు మూసికొని యట్లే యుంటి రేమి? కొంచెము సేపు విశ్రమించి తము రండు.

తుల:–

శా. మాయామోహ లతానిబద్ధమతినై – మర్యాదయుం గీర్తియుం
బాయంజాలితిఁ గొన్నినాళ్ళు మమతా – ప్రాపంచికోపేతమా
నా యాశన్మొదలంటఁ ద్రెంచి తుది ధ–న్యాత్మ్యంబునన్ రామ భ
ద్రాయత్తంబొనరించి మైమఱచి బ్ర – హ్మానందమున్బొందెదన్.

(శ్రీ) హరి దర్శనమునకై నా చిత్తము తత్తఱమందుచున్నది. సెలవొసంగుము పోయివచ్చెద.

మమ:– ఇదేమి మతము నాథా! ఇప్పు డెచ్చటి కేగెదరు?

తుల:– భగవంతుని దర్శించుటకై నే నెచ్చటకైనను బోఁగలను. నాపై భ్రాంతి వదలుకొనుము. ఇది నాకారోపాసన. దీని నుండియే నిరాకారమునకుఁ బోఁగలను.

మమ:- (దీనముగ) నన్నేమిచేయఁదలచితిరి? నాగతి యింకేమున్నది? ఇంటనుండి భగవంతుని ధ్యానింపవచ్చును. నేను గూడ మిమ్ముల ననుసరించెద. మీ పాదములకు మ్రొక్కెద.

(పాదములఁ బడును)

తుల:- అక్కఱలేదు. ఈ తుచ్ఛ భోగములతో నాకుఁ బనిలేదు. సతీరత్నమా! ఏల నన్ను వారించెదవు? దాహపీడితునకుఁ గామధేనువు లభింపఁగా మృగతృష్ణ కాసించునా? ఈ విషయమున సాహసిక్యము వలదు.

గీ॥ మోక్షదాతయై శ్రీరామ - మూర్తి యుండ
నీటిపై బుగ్గవోలెన - నిత్యమైన
యీ శరీరపు భ్రాంతి నీ - కేల యనుచు
నీవు చెప్పినదేగదే - నీరజాక్షి!

గ్రహగతులు మాఱినను నా మనంబు మాఱదు.

(భార్యను దప్పించుకొనును)

మమ:- హా దైవమా! (మూర్ఛిల్లును)

తుల:-

ఉ. నమ్మినవారి సొమ్మని ఘ - నమ్ముగ నీసతి పల్కనంతనే
నమ్మితి నీదు పాద నళి - నమ్ముల నాయెద తమ్మునిల్పి ని
త్యమ్ముభజింతు నిర్మల ము - దమ్మున నిమ్మహి రామనామ నా
దమ్మె భవమ్ము వాపెడు వి - ధమ్మని సమ్మతి జానకీపతీ!

(నిష్క్రమించును)

తెఱవ్రాలును

—❧—

# తులసీదాసు

## చతుర్థాంకము

### ప్రథమరంగము

స్థలము - కాశీపట్టణములోని యొక గృహము

మధు:- (ప్రవేశించి, కోపముతో) ఓసీ! కులటా! దౌర్మార్గ్య మంతయు నేఁడు పరిత్యక్తమైనది. ఎంత గయ్యాళివైనను మగని నింత చులకనగాఁ జూతువా? నన్ను మోసపుచ్చఁగలవు కాని దేవునికనులు మూయలేవు. నీకు యమబాధలు తప్పవు. నా మనోవ్యసనమంతయు నూఱకపోవునా? నీ పాపములు నిన్ను బాధింపకమానునా? ద్విపాద పశువా! నేను పిచ్చివాఁడననుకొంటివా? ఛీ! ఛీ!! నీ మొగము చూచినఁ బంచమహాపాతకమ్ములోనఁగూడును. నీకు మానవ జన్మము తగదు. స్వైరిణీ! నీవిఁక పిశాచమైపోదువుగాక!

మద:- (ప్రవేశించి) ఆఁ! ఆఁ! నాథా! క్షమింపుఁడు. బుద్ధివచ్చెను.

మధు:- నోరు మూయుము. నీకింకెక్కడి నాథుఁడు. ధర్మము తప్పిన పిదప నీవెవ్వతెవు? నేనెవ్వఁడను? "యవరికివారే యమునా తీరే" నేటితో నీకును నాకును ఋణము తీఱినది. నేను సత్యనిష్ఠ గలవాఁడనైనచో నా వాక్కమోఘమగుఁగాక!

మద:- అయ్యో! దైవమా! ఇఁక నాకు గతియేమి? నా కర్మము

నేననుభవింపవలసిన కాలము వచ్చినది. నాశరీరమున కేదియో యగ్నిజ్వాల సోఁకినట్లు బాధ వొడముచున్నది. (పతి పాదములఁబడి) స్వామీ! ఎంతకాలము పిశాచ రూపమున నుందును? నా శాపావసానం బనుగ్రహింపుఁడు.

మధు:- తలపగిలిన పిదపఁ దడవుకొనుచుంటివా? గర్వాంధురాలా! తగదని బుద్ధిచెప్పినఁ జెవి నాటలేదుగదా? ఏ చెట్టు పండ్లా చెట్టుక్రిందరాలక యింకెచ్చట రాలుననుకొంటివి. కానిమ్ము. శాపాంత మభ్యర్థించుచుంటివి గానఁ జెప్పుచుంటి పన్నెం డేఁడులు పరమభక్తుని పాదతీర్థ మానినప్పుడు శాపావసాన మగుఁగాక! పొమ్ము.

మద:- ప్రపంచమున నాయట్టి దుశ్చరితలకుఁ జివఱకీగతి పట్టును. ఇఁక నేను బ్రతుకుట భూమికి బరువుచేటు. హా! తాపము.

(మూర్ఛపడును)

మధు:- అబ్బబ్బా! నాపీడ విఱుగడై పోయినది. బాబూ! యమ బాధ యమబాధ ఇట్టిస్త్రీలతోఁ గాపురంబు వలదుసుమా.

సీ. మగఁడింటనుండినఁ - బగవానివలెఁ జూచి
మలమల మొగమూస్త్రై - మాడ్చికొనుచు
అత్తఁడీసాడన్న - నామె కోదాడంచుఁ
జిట్టుబుట్టాడుచుఁ - జిందు ద్రొక్కు
ఛీ! యంచు నతఁడు ముం - జేత నదల్చినఁ
జప్పుచప్పున పది - సార్లదల్చి
యెంత యాగ్రహ దెచ్చి - యిడుచున్నఁ బలుమారు
పొరుగింటివారి కా - పురము మెచ్చి

గీ. సిగ్గులేక బజారెక్కి - చెడిపవోలెఁ
చిన్న పెద్దల పాటింప - కన్నియెడల
గాల్చుకొని తిను గయ్యాళి - గంపతోడఁ
గాపురముకంటె మఱి నర - కంబు కలద?

(నిష్క్రమించును)

తెఱ వ్రాలును

## ద్వితీయ రంగము

స్థలము - కాశీ విశ్వేశ్వరాలయ సమీపము

తుల:- (ప్రవేశించి) ఇదియే కాశి. దివ్యక్షేత్రమైన వారణాసి.

సీ. జన్మ జన్మార్జిత - సకల పాపాన్విత
భవలతాచ్ఛేదనా - వాసి కాశి
మోక్షసాధన తపో - దీక్షార్థి మునిరాజ
రాజిత బహుపుణ్య - రాశి కాశి
జాహ్నవీ మల్లికా - జాలావృత సురాళి
పావన గుణకేశ - పాశి కాశి
నాస్తిక వాగ్వాద - విస్తృత పవన జా
లాస్తిక మత భుజ - గాశి కాశి
గీ. వినుత లోలార్క - కేశవ - విఘ్నరాజ
నైజ దాన కళాన్నపూ - ర్ణా సమేత
విశ్వనాథ సురక్షిత - వివిధలోక
ఘన విలాస కైలాస సం - కాశి కాశి॥

దయానిధీ! దాశరథీ! యెచ్చట నుంటివి? వైకుంఠమున నుంటివా? భక్తుల హృదయ పద్మములం దుంటివా? పాప సంహరణ క్రీడా వినోదివై యుంటివా? లేక నీ వియోగంబున వత్సర కాలము దుఃఖించిన సీతాదేవిని బుజ్జగించుచుండుటచే మా యట్టి దీనుల యార్తనాదము వినఁబడుట లేదా? అట్టి వాఁడవు నుగాదే! నాఁడగస్త్యుని శాపంబున నింద్రద్యుమ్నుఁడు గజేంద్రుఁడై దేవలముని శాపంబున మొసలియై యున్న హూహూ యను గంధర్వుచేఁ బట్టువడి ప్రాణావశిష్టుఁడై ప్రార్థింప నాక్షణంబున భార్యా వినోదుండవై యుండి భక్తుని రక్షింపవా? అదిగో! విశ్వేశ్వరాలయము అచ్చటి కేగితినేని భుక్తియు ముక్తియు లభించును. (లింగాకారమునకు మ్రొక్కుచు) స్వామీ! కాశీవిశ్వేశ్వరా! నీకు జాతిమత భేదము లేవియు లేవా? ఆస్తికులైన హైందవులందఱు నీకు సమానులా?

వారివారి స్వహస్తములతో "వారిః ఓ"మ్మని నిన్నభిషేకించు చున్నారే. నీ దృష్టిలో హెచ్చు తగ్గులు లేవా? నీసేవ కర్హానర్హతలు కానరావా? దేవా! ఏమి నీ సమదృష్టి. ఈదృశ్యము నాకు మహోపదేశ తుల్యమైనది. నీ ప్రేమను సంపాదించి నీలో నైక్యము కావలయునన్న నీ గుణము లలవఱచుకొన వలయుఁగదా? అట్టిభాగ్యము నాకుఁ గలుగునా?

తెఱలో - అయ్యా! మీరు త్వరగా నీవలకు రండు.

తుల - వచ్చుచున్నాఁడను. ఈ దేవాదిదేవుని గనులారఁ గాంచి చేతులారఁ బూజించి తనివిదీరఁ గీర్తించి వచ్చెదను.

—♦ దండకము ♦—

శ్రీమన్మహాదేవ దివ్యప్రభావా శివా ప్రోవరాణ భవానీ ధవా దేవదేవా గిరీశా పరేశా మహేశా సదాభక్త సంపూజ్య పాదాబ్జి తాఘప్రమోదా జయ శ్రీనినాదా పరాశక్తి నాథా మహావ్యాఘ్ర చర్మాంబరా పాప సంహార ధీరా శుభాకార వీరాధివీరా భుజంగేశ భస్మాక్షు సంశోభి వక్షా పురాదక్ష శిక్షా మహాయోగ దక్షా కళా ధ్యక్షు వాగీశ యోగీశ రక్షా హరా నీలకంఠా సువద్ధ ప్రతోషాగ్రి ఘుంటాజ్వలన్నేత్ర భాస్వల్లలాటా నిరాఘాట చంద్రార్థ దీవ్యత్కిరీటా భవోద్ఘాట గంగా జటాజూట కైలాసకూటా త్రిశూలీ కపాలీ దురాశా పిశాచాదులా శాకినీ ఢాకినీ భంగ సత్సంగ కాళీ మనో పద్మభృంగా చిదాభాస లింగా భవా బ్రహ్మవై సృష్టి గావింపఁగా విష్ణువై పెంప రుద్రుండవై సంహరింపన్ సమర్థుండవై యొప్పు నీవిశ్వ రూపంబు నే నెంచఁగాఁజాల రక్షింపరా విశ్వనాథా నమస్తే నమస్తే నమః (వెలికి వచ్చి)

రామా! జగదభిరామా! నీ సేవఁజేసి నిన్ను దర్శించుటకై సమస్త భోగములను విసర్జించితిని. విషయ సుఖములను విషముగాఁ జూచితిని. తల్లిదండ్రులను విడనాడితిని అర్థాంగిపై నాస వీడితిని నీ దయవలనఁ గలుగు బ్రహ్మానందమే సర్వము నకు మేరుపూస యని యెంచితిని. నీ వెట్టికష్టములు గలుగఁ జేసిన ననుభవించుటకు సిద్ధముగ నున్నాఁడను.

సీ. నీ నామ జపసుధన్ - నిశ్చలంబుగఁ గోలఁ
బ్రహ్లాదు కష్టముల్ - బాపితీవు.
నినుఁగూర్చి తపమున - నెగడిన ధ్రువునకు
నచ్చిన మండలం - బిచ్చితీవు.
నిన్ను శరణువేడ - మన్నించి లంక కా
శ్రితు విభీషణు రాజుఁ - జేసితీవు.
నీ వైరితోఁ బోరి - నిర్జీవియౌ జటా
యువునకు మోక్షంబు - నొసఁగితీవు.

గీ. దాతవే నీవు నాబోటి - దాసజనుల
నేల రక్షింప రావయ్య? - ఇన కులేంద్ర!
కన్నబిడ్డలఁ దల్లియే - కాలఁద్రోవ
బుజ్జగించెడి వారింకఁ - బుడమిఁ గలరె?

మధు:- (ప్రవేశించి) ఈతఁడొక పిచ్చివానివలెఁ గనఁబడుచున్నాఁడు. సంగీత సాహిత్యములలో దేనిలో మతి చెడినదో కాని హరి నామ స్మరణ చేయుచుఁ బాటలు పాడుచుఁ దనలోఁ దాను నవ్వుకొనుచుండును. ఇతని వాగ్ధోరణి యసామాన్యము. కష్ట సాధ్యమగు కుండలీ యోగమున నీతని మనము కుదిరిక తప్పెనా? ఓయీ! మీది యే యూరు? ఎచ్చటికిఁ బోవు చుంటివి? మనస్సేల చెడెను?

తుల:- అయ్యా! నాది యే యూరైనదియు నాకుఁ దెలియలేదు. రాముఁడున్న యూరికిఁ బోవుచుంటి. రామానుగ్రహము వలన నాకిట్టి మతి కలిగెను. సర్వరూపమును తనవే యైన రాము నెట్లు గనుగొనఁగలను?

మధు:- నేనడిగినదొకటి. నీవు చెప్పునది వేఱొకటి. నీ ధోరణియే నీది. పాపము పిచ్చివాఁడవు. పొమ్ము. నీదారిని నీవు పొమ్ము.

తుల:- నాకేమియును బిచ్చి లేదు. పిచ్చిపట్టిన లోకులు నన్నుఁ బిచ్చి వాఁడనుకొందురు. నాకుఁ బట్టిన పిచ్చి మంచిదియే. అజ్ఞాన మునకుఁ బిచ్చి. అహంకారమునకుఁ బిచ్చి. ఎవరికిఁ బిచ్చి? మూఢ మానవుల పిచ్చిని బాపు పిచ్చి.

మధు:- నీకుఁ దలి దండ్రులుగాని భార్యా పుత్రులుగాని కలరా?

తుల:- ఉండియు లేనివాఁడను. మా రామమూర్తియే యడవుల కేగునాఁడు పిచ్చివాని రూపముఁ దాల్పఁడా? శరణన్నఁ బిచ్చివారినిసైతము రక్షించువాఁడు.

మధు:- మాటలకేమి? మాయావేషధారు లెంతమందిలేరు చెప్పెడి వారేకాని చేసెడివారు సున్న.

తుల:- అయ్యా! అట్లనరాదు. తాను దొంగయైనఁ బొరుగును నమ్మఁ డనినట్లు మన మజ్ఞానములో నుంటిమని ప్రపంచ మంతయు నట్లే యుండు ననుకొనుట గొప్ప పొఱపాటు. ఏ పుట్టలో నేపాముండునో సామాన్య జనులవలెఁ గష్టసుఖముల ననుభ వించుచు మనస్సునందు మాత్రము విషయాదులను నిమిత్త మాత్రముగఁ జూచుచు సాధన వశంబున బ్రహ్మానందము నొందఁ జూచు ధన్యులు పైకేమియుఁ దెలియనివారివలె నెంద ఉందురో. సర్వమునకు మనస్సే ప్రధానము. మనుజుఁడు మాత్రము మనతోఁబాటు చరించుచున్నను మనసుమాత్రము షడ్చక్రములకు మించి సంచరించుచుండును. అట్టివారి చర్యలు గూఢములు.

మధు:- ఔనుకాని నీలో నీవు నవ్వుకొనుచుందువేల?

తుల:- ఆనందము. మహానందము. ఆ శ్రీరామ మూర్తి నా మన స్సులోఁ గనఁబడుచుండును. ఆ నీలమేఘ చ్ఛాయ......ఆ శాంత స్వరూపము..... ఆ చిరునగవు..... ఆ భక్తత్రాణ పరాయణత్వము పరమానంద దాయకము. మీరును నాతో రండు. ఆ శలను వదలుకొనుఁడు. హరినామ స్మరణ సేయుఁడు. శ్రీనివాసుని సేవింపనిచో మనచిక్కులు దిరువా?

(బాలురు దాసుపై ఱాలు రువ్వుదురు)

మధు:- బాలకులారా! ఏల ఱాలు ఁ వ్వెదరు? మావలె మానిసి కాదనుకొంటిరా? నొప్పి లేదనుకొంటిరా? పదఁడు మీ తల్లి

దండు్రిలకుఁ జెప్పి మిమ్మేమి చేయింతునో చూడుఁడు.

(బాలురఁ దఱుముకొనిపోవును)

తుల:- ఏల బాలురువ్వెదరు? రామ దర్శనమునకు మార్గముఁ జెప్పఁగలరా?

(మధుకరభట్టు, ఆత్మారాముఁడు, రత్నాభాయి ప్రవేశించుచున్నారు)

మధు:- రండు. ఇతఁడే మహాభక్తుఁడు. వలయునేని వారితో మాటలాడుఁడు. నేనా బాలుర దుండగములను తలిదండ్రులకుఁ జెప్పిగాని తిరిగి రాను. (నిష్క్రమించుచున్నాఁడు)

ఆత్మా:- నేఁడెంత సుదినము. ఇప్పుడుకదా మన వంశము పావనమైనది. కృతార్థులమైతిమి. ఇంతకంటె నానందపడవలసిన విషయము వేఱొండు కలదా? ఓసీ! వెఱ్ఱిదానా! ఎందులకు దిగులుపడెదవు? పదినెలలు మోసి కని పెంచినందులకు నీ ఋణముఁ దీర్చినాఁడు పాతివ్రత్య పుణ్యఫలము ఫలించినది? వైరాగ్యమూర్తి భాగవత శిఖామణి యైనాఁడు. ఆహా! మన భాగ్యమే భాగ్యము. బ్రహ్మతేజము. మూర్తీభవించిన బ్రహ్మతేజము. ఈ వైరాగ్యమూర్తి శ్రీరామమూర్తిని దర్శించుటబ్బురమా? ధన్యులము. ఈ కన్నులు చేసికొన్న పుణ్యమింతయని చెప్పతరముకాదు. అసమానమైన భక్తి వీని కెట్లబ్బినది? ఒక్కసారి పుత్ర గాత్ర పరిష్వంగసుఖ మనుభవించి తన్మయత్వముఁ జెందువాఁడ. తనయా! భాగవత శిఖామణివైతివా? (కౌఁగిలించుకొనును)

తుల:- జనకా! వందనములు.

ఆత్మా:- ఆనందము......ఆనందము. (ప్రాణములు వీడును)

తుల:- దైవానుగ్రహమునకు దారిఁ జూప వచ్చితివా? తండ్రీ!

(ఆత్మారాముఁడు నేలపైఁ బడును)

తుల:- (సాశ్చర్యముగ) ఇదియేమి? మైమఱచినాఁడు. ఆత్మతేజం బంతయు నదృశ్యమగుచున్నదే! శరీరము చలువ గ్రమ్ముచున్నది. నాయనా! నాయనా! యింకెక్కడి తండ్రి? ఇందులకే యిచ్చటికి వచ్చితిరా?

రత్నా:- దేహము చల్లఁబడిపోయినది. ముఖము కళ తప్పినది. అయ్యో! దైవమా! నాకింకెక్కడి భర్త. హా విధీ! నాకెంత యన్యాయపు వ్రాఁత వ్రాసితివి. ఓ భగవంతుఁడా! రక్షింపుము. తల్లీ! భూదేవీ! జ్ఞానమూర్తియగు నా నాథుఁడే నీకు బరువాయెనా? ఓ దేవతలారా! ఈ మహాత్మునిపై నమృత వర్షము గురియింపరేమి? ఆఁ! ఏమనుచుంటిరి? "జాతస్య మరణమ్ ధ్రువ" మ్మనియా? జీవితేశ్వరా! నీకీ కష్టకాలమునఁ గటికి నేలయే మెత్తని పాన్పయ్యెనా? హా పతి! సుగుణమతీ! (మూర్ఛిల్లును)

తుల:- కని పెంచినందులకు గుక్కెడు నీళ్ళు గొంతులోఁ బోయఁ జాలని యీ కొడుకునకై నీవేల ప్రాణ త్యాగముఁ జేసికొంటివో యూహింపఁ జాలకున్నాఁడను. పుట్టినదాది నీ మనస్సునకుఁ గష్టముఁ గలిగించిన దుర్మార్గుఁడను. ఏదియో ధర్మము నుపదేశించుటకు వచ్చితి ననుకొంటిని. ఇట్లయ్యెదవని తలంప లేదు. సందిగ్ధ దశలో నున్న యీ యభాగ్యునకు నీవంటి తండ్రి దక్కునా? హరీ! మా యవతారములఁ జివఱ కెట్లు మార్చితివి? నా స్థితికై విచారబడుచున్న తల్లికి గోరు చుట్టుపై రోఁకటి పోటు చందమున దుర్భర భర్తృ వియోగమును గలిగించితివే. అమ్మా!

రత్నా:- (దీనముగఁ జూచును)

తుల:- తల్లీ! ఇంకేది కర్తవ్యము? అయ్యో! ఈమె ప్రాణి చెడి పోయినట్లున్నది. అమ్మా! తండ్రిని గఱువుచేసికొనిన యీ యభాగ్యున కింకేది కర్తవ్యము?

రత్నా:-కర్తవ్యము యోచించుకాలము గడచిపోయినది. సర్వభోగములనను భవించుచున్న మన సంసారము నేఁటికి సర్వనాశన మైనది. భర్తృ వియోగము దుస్సహము... హా! నాథా!

(మూర్ఛిల్లును)

తుల:- పితృ శవముఁ జూచుచున్నకొలఁది నా హృదయ కోశమునఁ

జేయి వెట్టి కలఁచినట్లున్నది. పురుషుండనైన నాకే గుండె నిబ్బరము లేనిచో నీయమ నెట్లోదార్పఁగలను? ఆహా! ఏ ప్రాణికిని జీవితమంతయు నొక్క రీతిగాఁ జరుగదుగదా!

మ॥ సుతుఁ డిట్లయ్యెను భర్త పోయెనని తా - శోకించు నాతల్లి దు
ర్గతికై యేడ్చెదనా? పతిన్వీడువ ని - క్కంబంచు నాతోడనే
వెతలం జెందెడి భార్య కష్టములకై - వేమారు చింతింతునా?
గతిలేకే చరియించు నా స్థితికి నేఁ - గల్గోయి దుఃఖింతునా?

దుఃఖించినను జనిపోయిన తండ్రిని బ్రతికింపఁగలనా? తల్లీ! ఇట్లెంత దురపిల్లిన నేమి లాభము. ఊరడిల్లుము.

రత్నా:- నాయనా! మీ నాయనగారితోడనే నా సర్వ సౌఖ్యములదృశ్యములైనవి నాబ్రతుకు శిఖలేని దీపమువలెఁ జంద్రుఁడు లేని రాత్రివలె నిస్తేజము, నిరర్థకము, నీరసము. కావునఁ జితి పేర్చి యగ్గి ముట్టించితివేని నా శరీరమును మీ తండ్రిగారితో సర్వ భక్షకునకు సమర్పించెదను.

భటుఁడు:- (ప్రవేశించి) మీరెవరు? ఈశవము నిచ్చట నుంచుటకు వీలు లేదు. దహన సంస్కారమునకుఁ దీసికొనిపొండు. ఇది రాజ శాసనము. (నిష్క్రమించును)

తుల:- తండ్రి కగ్ని సంస్కారములు గావింపవలయునన్నఁ గట్టెలకొక్క కాసైనను నాకడ లేదు. ఈ ప్రాంతమందు సమిధలైనను లేవు పైఁగాఁ గాటిసుంక మొకటి చెల్లింపవలయును. జననీ! పితృమరణ శోక దావానల దందహ్యమాన మానసుఁడనై దారి తెలియని నన్నిట్లు కోరుట మూల్గెడి నక్కపైఁ దాటికాయఁ బడవేయుట. పాండురాజు చనిపోయినను బుత్త్ర సంరక్షణార్థము కుంతీదేవి ప్రాణములు నిలుపుకొనదా? అభిమన్యుఁడు మృతినొందిన నుత్తర జీవింపదా? ఈశ్వర ఫాల నేత్రాగ్నికి మన్మథుఁడు భస్మమైనను రతీదేవి మనలేదా? తల్లీ! అట్లనకుము.

రత్నా:- నా జీవితపథము గాఢాంధకార బంధురమైనది ఏవైపు చూచినను విషాద కంటకావృతమే?

తుల:- అమ్మా! సర్వజ్ఞుండైన సర్వేశ్వరుని యాజ్ఞావిశేషంబునఁ బ్రాణికోటికిఁ గర్మానుసారంబుగాఁ గాలచక్ర మేదియెట్లు మార్చునో యెవ్వరెఱుంగుదురు.

సీ. అతిశాంతు ధర్మజు - నడవిపాలుగఁ జేసె
దురితాత్ముఁ గౌరవు - ద్రొర నొనర్చె
ఘనభక్తు గుకాంగ - దుని విటునిగ మార్చె
భోగి యయాతి వి - రాగి సలిపె
దానకంకణుఁ గర్ణుఁ - మానహీను నొనర్చె
మును జలంధరు స్వర్గ - మునకు లాగె
రారాజు నలు నన్న - మో రామ యనిపించె
ధనహీనుని గుచేలు - ధనదుఁ జేసె.

గీ. నవని నభిమన్యునకు నాయు - వల్పమిచ్చి
చీఁకుఁజేనికి నిండారఁ - జెలఁగఁ జేసెఁ
గాల మిట్టిది కనుక నే - కాలధర్మ
మొందులోపల నేగతు - లొందఁ గలమొ?

అంత్యక్రియలు సేయుటకు సహాయుఁడొక్కఁడును లేఁడు పితృ శవమును వీపుపై మోసికొని పోయి గంగానదిలో విడిచెద.

(గంగను సమీపింతురు)

రత్నా:- తల్లీ! గంగాదేవీ! కడకు నీవే శరణ్యావు.

తుల:—

గీ. "ఆత్మవ త్సర్వ భూతాని" - యనెడి నీతి
జీవిత పథంబునం జూపి - సిద్ధుఁడైన
జనకు శవమును కోకమారు - శరణు చేసి
వదలుచున్నాఁడ గంగా భ - వానియందు

(శవమును వదలును)

ఏనుఁగు చచ్చినను బ్రతికినను వేయిరూప్యములనినట్లు బ్రతికి యున్నప్పుడు త్రికూటంబు నాశయించు నీవు మరణించియుఁ ద్రిపథగా సంయోగము నొందినాఁడవు.

రత్నా:- శివ జటాజూట సంగా! గంగా! నా ప్రాణేశ్వరునితో పాటు నన్నును నీలోఁ జేర్చుకొనుము. జే జగత్ప్రభూ!
(గంగలో దుముకును)

తుల:- అమ్మా! జాతిపడిపోయితివా? చావవలయుననియే గంగలో దుముకితివా? ఈ పాపాత్ముని తను స్పర్శవలనఁ బరమ తపో నిష్ఠాగరిష్ఠుండగు తండ్రి పరలోక గతుండయ్యెను. ఈ కృతఘ్నుని మార్గము వేఱయ్యె ననియు సంసారము పాడయ్యె ననియుఁ బ్రాణములు వీడితివా? స్వర్గ మర్త్య పాతాళము లకుఁ బ్రవహించుచున్న యీ గంగానదీ మార్గమున రాజ హంసలవోలెఁ దేలియాడుచు స్వర్గమునకుఁ బోవుచుంటిరా? ఇఁక నాగతి? తనువు విడిచిపోయిరి .. పోవుచున్నారు... పోఁగలరు. కావున నేనును భాగీరథిలోఁ బడి ప్రాణములు వీడెద. (గంగలోనికి దిగి)...... ఏమది? నా యంతరాత్మ యెద్దియో బోధించుచున్నది. ప్రాణముపై నాశ చేఁ గాదు గదా? ఏక్షణమున సంసారము నిస్సారమని రోసి శ్రీ రామ మూర్తియే దిక్కని నమ్మితినో యాక్షణంబున నేయన్నింటిపై నాశ వదలుకొంటిని. వదలుకొన్న దుఃఖమేటికి? ''శరీర మాద్యం ఖలుధర్మ సాధన'' మ్మను సూక్తి ననుసరించి సర్వ ధర్మములకు మూలకారణమైన దేహము నొసంగిన దాతలు గావున...... నే దుఃఖించిన వారికిఁ జావు తప్పునా? అంత దనుకనేల నాకుఁ దప్పునా? రేపు చచ్చుటకు సిద్ధముగ నున్న నేను నేఁడు చచ్చినవారికై విచారించుటయా? నే నిప్పుడు చచ్చుట ధర్మమా? చావక రామ దర్శనము సాధించుట ధర్మమా? ఇంతయైన నింకెంతయైనను జీవఱకఁ గంఠము తెగుచున్నను (శ్రీ) మహావిష్ణువును దర్శించుటకే ప్రయత్నిం చెద (నీటినుండి వెలుపలికి వచ్చి) పరమాత్మ స్వరూపుండ వైన దేవా! నీసందర్శనభాగ్యమపేక్షించి పురోగమనమాచ రించుచున్న నాకుఁ బ్రపంచ సంబంధమైన ఋణానుబంధము

లను సూర్యుని సమీపించుచున్న చంద్రుని కళల వలెఁ గ్రమక్రమముగా నదృశ్యము చేయుచుంటివా ? మంచిది. రాజదర్శనముఁ గోరువాఁడు మున్ముందు తదాశ్రయుల సన్నిధానమపేక్షించినట్లు నేనిప్పుడు భక్తుల యాశ్రమములకే బయలుదేరెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

[తెఱ వ్రాలును]

## తృతీయ రంగము

### స్థలము - రాజమార్గము

మాలదాసరి:- (ప్రవేశించి) ధర్మము నశించుచున్నప్పుడు దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై భగవంతుండగు నారాయణమూర్తి మానవ రూపముతో భూలోకమున నవతరించునని శాస్త్రములు ఘోషించుచున్నవి. కాని యది యీయుగమున సంభవమా యసంభవమా యని సంశయము గలుగుచున్నది. దినములు గడచినకొలఁది భేదములుప్పతిలుచున్నవి. మనస్సులు మాఱుచున్నవి. నమ్మకములు నశించుచున్నవి. ఈశ్వరేచ్ఛ; దైవమా ! యీ యాఁకలి బాధ భరింపలేను. ప్రేగులు గూడ మలమల మాడిపోవుచున్నవి. అయ్యలారా ! నా గోడెవ్వరికిని వినఁబడుటలేదా? అమ్మలారా! యీ ముసలి దయ్యపు మొగానఁ బట్టెడన్నముఁ బడవేయుటకు మీ మనసొప్పదా? కన్నులు కనఁబడక చెవులు సరిగా వినఁబడక నడవలేక నా పడు బాధ పరమాత్మునకే యెఱుక. నోటికక్కఱకు వచ్చిన కొడుకును జూచి భగవంతుఁ డోర్వలేక పోయినాఁడు నా యనువారు సున్న. పూచిన తంగేడు వలె మా కాపురము పచ్చఁగా నున్నంతవఱ కందఱు బంధువులుగానే కనఁబడినారు. ఇంతలో స్వకులాభిమానము తలకెక్కి పల్లె పల్లెకుఁబోయి మావారి ప్రవర్తనము బాగుచేయవలయునని ప్రబోధము చేసినాడను దానితో మా కొంప యేనుఁగు మ్రింగిన వెలగపండైనది. సంఘ సంస్కరణ మనఁ

గానే క్రొత్త చట్టములను దెచ్చి పెట్టుచున్నాఁడని మావారే కోడెత్రాచులలాగున లేచినవారు కొందఱు. అంతట వారికి నాకును రసాభాసము. మమ్ము హీనులుగాఁ జూచువారితో సమయము వచ్చినప్పుడు మీకున్న హక్కులు మాకేల లేవని వాదించుట నాకుఁ దటస్థించెడిది. అందువలన వారు నన్ను మఱింత యీర్ష్యతోఁ జూచుచుండిరి. తుదకు రెంటికిం జెడిన రేవఁడనైతినె నీరజేక్షణా యనెడి స్థితి పట్టినది నాకు. మావారొక మెట్టెక్కినట్లుగాని వారొక మెట్టు దిగినట్లుగాని నా దృష్టికిఁ దోపలేదు. మా పల్లెలోఁ బట్టెడు మెతుకులు వేసెడి దిక్కులేక నేనిటు బయలుదేరినాఁడను. బావను జూచిన మఱఁదలువలె నన్నుఁ జూచి తొలఁగిపోయెడివారే కాని యనాథ శిశువుంబలెఁ గనికరించుట కల్ల. అది వారి దోషము కాదు గాలిపోయిన కొలిమి తిత్తివలె శరీరము ముడుతలుపడి యెండిపోయిన కాకరపాదు తీఁగలవలె నరములు బయటఁపడి పక్వమైన చింతకాయలోనిగుజ్జువలె రక్తమాంసములుక్షీణించి యస్థిపంజరమువలెఁ గనఁబడుచు ముసలికంపు గొట్టుచున్న నన్నెవ్వరు దరిఁజేరనిత్తురు. భగవంతుఁడా! నాకెందులకీ మొడియాయువు? రామచిలుకవలె నారామ కేళీవిహార వినోదులగు లేజవ్వనంపు దంపతుల కెడపాటు గల్పించుచుంటివే, బంగరు తూఁగుటుయ్యాలలపైఁ దులదూఁగు తల్లిబిడ్డలను వేఱుచేయుచుంటివే. అట్టివారికిఁ బూర్ణాయువిచ్చి నావంటివానిని నీ దరికిఁ జేర్చుకొనరాదా ? భాగ్యవంతులారా! మీ భోగములకై యొక క్షణంబులో వెచ్చించు ధనము నావంటివానిపొట్టకు సంవత్సరములకొలందజీవనాధారమగును. అన్నలారా! నాలుకపిడుచగట్టుచున్నది. చిఱుచెమట క్రమ్ముచున్నది. నేనును మీవలె మానవుఁడనుగానా? పశువులకంటె హీనుఁడనా? ఇంత గంజుయైనను దొఱకునట్లు లేదే. నా తండ్రులారా! యిఁక నడవలేను దాహము...దాహము.

భటుఁడు:- (కోపముతోఁ బ్రవేశించి) ఎవఁడా మాలదాసరి ? కఱ్ఱ మోటించుకొనుచు రాజ మార్గమున కడ్డముగాఁ దిరుగుచున్నాఁడు. స్వైర విహారార్థము యువరాజుగారు రథారూఢులై వచ్చుచున్నారు. పోమ్మావలకు. (దాసరిని నెట్టి పడవైచిపోవును. దాసరి గాయపడును. భిక్షాపాత్రము పగిలి పోవును. అతడు విలవిల తన్నుకొనుచుండును)

తుల:- (ప్రవేశించి) ప్రమాదము... పాపము... వృద్ధుఁడు. తల పగులలేదుకదా ? నోరు తెఱచుచున్నాఁడు. ఓ గృహస్థులారా! కొంచెము మంచినీటి నిప్పించెదరా?

తెఱలో సమీపింపకుఁడు. అంటరానివాఁడు.

తుల:- (కోపముతో) అంటరానివాఁడు........ అంటరానివాఁడు. ఆపత్కాలమందును నంటరానివాఁడని యల్లాడుచున్న యీ యంటరానివాఁడెవఁడు చెపుమా ? ఓయీ ! యంటరాని తనమును ముందే యగ్నికంటగట్టితిమి? దురహంకారము...

మ॥ కులభేదంబుల హెచ్చు తగ్గులిటు నీ - కున్నాకు వాకట్టులై
కలకాలంబును నిల్చియున్న నిఁక నే - కార్యంబు సాధింపఁగాఁ
గలమా? యైక్యము లేని హైందవుల మోఁ-కుంబెన్నఁ గాసున్న యీ
పలు పోకల్ విడనాడి దేశసుఖముల్ - భావి పరా! సోదరా!

ఇచ్చటఁ గాలు గాయపడి రక్తము స్రవించుచున్నది. (తన పైగుడ్డఁ జించి రక్తమును దుడుచుచు) దీనికిందగిన చికిత్స చేయువా రెచ్చటనున్నారో.

దాసరి:- (తన కఱ్ఱను వెదకితీసికొని దాను తలమీఁదఁ గొట్టి) చావుఁ దుర్మార్గుఁడా! మేమన్న నంత చులకదానమా ? దిక్కు లేని వానిని నన్నిట్లు నెట్టి పడవేయుదు ?

తుల:- (శిరస్సుపైఁ జర్మము పగిలి రక్తము కాఱుచుండఁ దుడుచుకొనుచు) బాబూ! నేనుకాదు. ఆతఁడప్పుడే యదృశ్యుఁడైనాఁడు.

(మమతాదేవి మధుకరభట్టు ప్రవేశించుచున్నారు)

మమ:- (పైటచెఱుగుతో భర్తృ శిరోరక్తమునద్దుచు)
ఆర్యపుత్రా! ఇదియేమి కాల వైపరీత్యము. మీ రీతనిచే దెబ్బతినవలసిన కర్మ మేమివచ్చినది? రక్తమింకను గాఱుచున్నది. అయ్యో! దీనికి మందెచ్చట లభించును?

మధు:- స్వామీ! తిన్నఁగా లేవఁగలరా?

తుల:- ఒక్క క్షణ మాఁగుఁడు రాజభటునిచే నెట్టబడిన యీతఁడు సమయమునకు సమీపించిన నన్నుఁ బ్రమాదవశమునఁ గొట్టినాఁడు. పాపము. శతవృద్ధుఁడు. ముందీతనిని సేదదేర్పవలయును. (రక్తముఁ దుడుచును)

మధు:- ఉపకారమున కపకారము ప్రత్యక్షమైనది. ఆహా! యీ పరమ భక్తాగ్రేసరుని పరోపకార పారీణత ప్రశంసార్హము. సాధువులనిన నిట్టివారే. ఈర్ష్యాసూయలు తాండవ మాడుచున్న యీ కలియుగమున నిట్టి మహాపురుషులరిది. పరుల వాని మేలుచూచి యోర్వలేని పరమనీచులు తనకుపకారము చేసినవానికే యపకారము చేయ సాహసించు ద్రోహులు పెక్కురు కనఁబడుచుందురుగాని యిట్టి మహాశయుని గనుంగొనుట దుర్లభము. (దాసరి చెవిదగ్గఱఁ జేరి) తాతా! నీవు గొప్ప పొరపాటు పడినాఁడవు. నీ గాయమునకుఁ గట్టు కట్టవలయునని సమీపించిన మహాభక్తుని తల పగులఁ గొట్టినాఁడవు. నీ వెవరవు?

దాసరి:- అయ్యా! నేను మాలదాసరిని.

మధు:- (బట్టలు విదిలించుకొనుచు లేచి) అయ్యో! దాసుగారూ! మాలదాసరి యఁట...... మాలదాసరి యఁట.

(గుడ్డలు దులుపుకొనును)

తుల:- ఆఁ! అయిన నేమి? ఛీ! యీ యహంకారమే పనికిరాదు.

మధు:- చిత్రము... చిత్రము.

మమ:- (భర్తతో) తిన్నఁగ నడువఁగలరా (భట్టుతో) వ్రణ చికిత్సాలయమునకు దారితీయుదురా?

మధు:- అమ్మా! యెచ్చటనున్నదియు విచారించి వచ్చెద.

(నిష్క్రమించును)

మను:- నాథా! మీ తలిదండ్రులు మీతోఁ గూడ వచ్చినారా?

తుల:- ఇంకెక్కడి తలిదండ్రులు. పరలోకంబున నిప్పటికే ప్రాప్త కాంక్షులైయుందురు. వారిని గంగపాలుచేసి యిటు వచ్చితిని.

మను:- హా! హతవిధీ! మాకొఱకై యెన్ని క్రొత్త క్రొత్త కష్టములను సృష్టించినావో యన్నింటి నొక్కసారి మాపైకిఁ బంపుము. ఆలసించిన నాశాభంగమగును. అత్తమామలారా! మమ్మిట్లు పరదేశములో విడిచి నదీమార్గమునఁ దూండ్లు తెగిన తెల్ల తామర పువ్వులవలె మీ దారిని మీరు పోయితిరా?

సీ. తాడు కట్టినదాది - తల్లి దండ్రులకంటె
మించిన ప్రేమఁ జూ - పించినారు.
పతి విరహంబుచే - వెతలు చెందెడివేళఁ
దగు బోధచేత నో - దార్చినారు.
తమ పేరు నిల్పు సం - తానంబు గల్గు నం
చెంచి వ్రతములుఁ జే - యించినారు.
నారాయణుని పాద - నళినమ్ములను నమ్మి
సాధు సజ్జన సేవ - సలిపినారు.

గీ. పరమ సుజ్ఞానులని పేరు - వడసినారు
భాగవతులార! మీ కిదే - వందనంబు
పోయినారలె మము వీడి - పుణ్యగతికి
మఱపు రారయ్యయో యత్త - మామలార!

మనోహరా! యింక మన కర్తవ్య మెద్ది?

తుల:- నీవే చెప్పుము.

మను:- మన యాస్తి సంతతియు నిచ్చటికిఁ దెప్పించి తమ పేరుతోఁ జక్కని మఠమును గట్టించి సాధువుల కన్నదానము చేయవలయునని నా కోరిక.

తుల:- మఱియు నిట్టి దిక్కులేని వృద్ధులకు ననాథ శిశువులకు బీద విద్యార్థులకు నన్నదానము జరుగవలయును.

మధు:- (ప్రవేశించి) స్వామీ! దయచేయుఁడు. (దాసరితో) ఓయీ! లెమ్ము చికిత్సాలయమునకుఁ బోవుదము. మహాభక్తుఁడు నీకు సేవ చేయుచున్నాఁడు.

దాసరి:- (దాసుగారి పాదములు పట్టుకొని) స్వామీ! క్షమింపుఁడు. అపరాధిని. కాటికిఁ గాళ్ళుచాచియున్న నిట్టిదశలో మీవంటి యుపకారి కపకార మొనర్చిన నే నింకెట్టి కష్టములు పడవలయునో కదా! స్వామీ! నేను తరించు టెట్లు?

తుల:- ఓయీ! పాపపు దూదిరాసి పశ్చాత్తాపానలంబున భస్మీకృతమైపోవును. ఆపైని భగవంతుఁడే సర్వలోకశరణ్యుఁడు. లెమ్ము (భట్టుతో) ఆవైపు పట్టుకొనుఁడు.

(తిన్నఁగా నడతురు)

మధు:- మారీస్ఫోటకాది బ్రాహ్మాస్త్రిదులను. భయంకర యుద్ధములనెడి నారాయణాస్త్రిదులను జల ప్రళయాగ్ని ప్రమాద జంఝామారుతాది పాశుపతాస్త్రిదులను బ్రపంచ వాతావరణంబనెడి యమ్ములపొదిలోఁ బాపాత్ముల కొఱకే నటన సూత్రధారి భద్రపఱచి యుండవచ్చు. అడుగడుగు దండములవాఁడా! ఆపద మ్రొక్కులవాఁడా! పాహి, పాహి.

(నిష్క్రమించుచున్నారు)

[తెఱ వ్రాలును]



# తులసీదాసు

## పంచమాంకము

### ప్రథమరంగము

స్థలము — తులసీదాసు మఠము

తుల:— (బావి సమీపమున నున్న తాతిపైఁ బాద ప్రక్షాళనము చేసికొని)

సీ॥ మత్స్యమై సోమకు — మద మడంచి విరించి
కెలమి వేదంబుల — నిచ్చితీవు
కూర్మమై మంధర — కుధరంబు వీపుపైఁ
గవ్వంబుగా మోయఁ — గలిగితీవు
కిటివై హిరణ్యాక్షు — గీటడంచి మునుల
బహువిధ బాధలఁ — బాపితీవు
నరసింహమై హిర — ణ్యకశిపు నఖహతిఁ
జీల్చి దేవతల ర — క్షించితీవు
వామన మూర్తివై — బలిని యాచించి దే
వేంద్రునకే స్వర్గ — మిచ్చితీవు
పరశురాముండవై — ధరణీ పతులఁ బట్టి
ముయ్యేడు మారులు — మొత్తితీవు

గీ॥ రామకృష్ణావతార వి - రాజివగుచు
రావణాసుర కంసులం - జావమోది
బౌద్ధ కలికి వేషముల భూ - భారముణంచి
భక్తులను బ్రోవవే నీవు - పద్మనాభ!

(బాతి యడుగు భాగమునుండి భూతము వచ్చి నిలువంబడు)

భూత:- స్వామీ! వందనము. కృతార్థురాలనైతిని. మీ కేమి కావలయునో కోరుకొనుఁడు వెంటనే తీసికొనివచ్చి తమకు సమర్పించెద.

తుల:- నీ వెవ్వతెవు? పిశాచమువలె నున్నదానవు.

భూత:- ఔను మహాత్ముల మాట వ్యర్థ మగునా? నేను పిశాచమనే. అయినను మీకుం గావలసిన సాహాయ్యము చేసెదను. సౌందర్యవతులగు యువతులు కావలయునా? ధన ధాన్యములు కావలయునా? వాహనములా? ఏమి కావలయును? ఒక్క క్షణములో మీ సన్నిధానమునకుం జేర్చెద.

తుల:- పిశాచము నాశ్రయించువాఁడు పిచ్చికుక్క వంటివాఁడు.

భూత:- స్వామీ! నేనీ స్థితిలో నుంటినని మీరు నన్ను తృణప్రాయముగం జూచుచున్నారు (శ్రీ) రామునకుం గోంతులు సాయము చేయలేదా? సింహమునకుం జిట్టెలుక రాజునకు బంటు తోడ్పడవలసిన కాలము వచ్చుచుండును. నిజము చెప్పుచుంటి. పూర్వ మిదియే మా యిల్లు. నా దౌర్భాగ్యమునకు నా భర్త పిశాచమగుమని శపించె. అంత నేను వేడుకొనం బది రెండు వత్సరములు పరమ భక్తుని పాదతీర్థము గ్రోలి శాప విమోచన మగునని చెప్పె. శాప విమోచన మైనది. మీ కోరిక సెలవిండు

తుల:- రామ దర్శనము.

భూత:- రామ దర్శనమునకు సరియగు మార్గమును జెప్పంగలను.

తుల:- అటులైన నీకీ పిశాచ జన్మ ముండునా?

భూత:- నేరస్థుఁడు రాజసభకు మార్గ మెఱింగియు లోనికిం బోంజాల

నట్లది నాకర్మ శేషము. ఇచ్చటికనతి దూరంబున నరణ్యామందు బేతాళుఁడు గలఁడు. ఆతఁడు భక్తులయెడ దయ గలఁడు అతని నడిగితిమేని రామదర్శనమునకు మార్గముఁ జెప్పఁగలఁడు. నా వెంట రండు. (నడతురు)

[ అడవిలో ]

బేతాళుఁడు:- (ప్రవేశించి) ఎవఁడా వచ్చునది? కపట వేషధారియైన రాజు కాఁడుగదా?

మ॥ బలగర్వంబున మత్ప్రతాపజయదు - ర్వార్గోర్ధతుల్ గాన కి
ట్టుల నేనున్న వనంబు సేరుదె? భూజా - టోపంబు ధీవిద్యలుం
గలవేని న్ననుడాసిచూడు మఁక నో - క్కండైన నాతోడ భూ
తల నాథుల్గలహించి నెగ్గిరొకో బే - తాళుండనంచెంచుమా?

భూత:- (ప్రవేశించి) ప్రభూ! నమస్కారము

బేతా:- నా యాజ్ఞ లేనిదే యిచ్చటి కేల వచ్చితివి?

తుల:- (ప్రవేశించి) ఈశ్వరాంశ సంభూతునకు వందనము.

భూత:- దేవా! యీతఁడు పదిరెండు వత్సరములు వైరాగ్యముతో రామనామ స్మరణ చేసిన మహాత్ముఁడు. వీరి పాదతీర్థముఁ గ్రోలుటచే నా శాప విమోచనమైనది. రామ దర్శనమునకు మార్గముఁ దెలియఁగోరి తమ సన్నిధికి వచ్చినాఁడు. పరీక్ష సేయుఁడు.

బేతా:- ముంజేతి కంకణమున కర్దమేల? అయ్యా! రామదర్శనమునకు మార్గముఁ జెప్పఁ జాలనుగాని యాంజనేయుని దర్శనమునకు మార్గముఁ జెప్పఁగలను. పిదప నీకు రామ దర్శనమగును.

తుల:- చిత్తము. సెలవిండు.

బేతా:- ఈ కాశీ పట్టణములో నసిఘట్టమున నిత్యము సాయంకాల ముద్ధవ దాసను పౌరాణికుఁడు వాల్మీకి ప్రోక్తమగు రామాయణమున కంతరార్థ మద్భుతముగ నుపన్యసించుచున్నాఁడు. హనుమంతుఁడు వృద్ధునిరూపమున వినుటకు నిత్య మచ్చటికి వచ్చుచుండును.

తుల:- నవ వ్యాకరణవేత్తయు మహా పండితుఁడునైన మారుతి మానవమాతుఁడు చెప్పుచున్న పురాణము వినుటకు వచ్చుచుండెననుట వింతగ నున్నది.

బేతా:- ఎచ్చటఁ బరమ శుభదాయకమైన భగవత్కథా కాలక్షేపము చేయుచుందురో యచ్చట భగవంతుఁడే యుండునన భక్తు లుండుటబ్బురమా?

తుల:- క్షమింపుఁడు. స్థిరపడుట కడిగితిని. నేను వారినెట్లు గుర్తింపఁగలను?

బేతా:- అడుగవలసిన ప్రశ్న నడిగితివి. పురాణ ప్రారంభమునందందఱికంటె ముందుగ వచ్చి శ్రవణానంతర మందఱికంటె వెనుక నెవ్వఁడేగునో యాతఁడే యాంజనేయుఁడు. మఱియుఁ గథాభాగంబున రామవిజము చెప్పుచున్నప్పుడు సంతోషమును బట్టఁజాలక కుప్పిగంతులు వేయుట కుద్యమించును. ఈచిహ్నములను బట్టి యాంజనేయుని గనిపెట్టుము.

తుల:- చిత్తము. సెలవొసంగుఁడు. (నమస్కరించి వెడలిపోవును)

[తెఱ వ్రాలును]

ద్వితీయ రంగము

స్థలము - అసిఘట్టము

(వృద్ధుని వస్త్రములను దాసు గట్టిగాఁ బట్టుకొన యిరువురు ప్రవేశింతురు)

వృద్ధు:- ఛీ! యెన్నిసారులు మొగంబున నుమిసినను సిగ్గులేదా?

తుల:- భగవద్దర్శనమునకు సిగ్గేల స్వామీ!

వృద్ధు:- వత్తులు మిఁగెడివేళ దాసులపని తెలియును

ఉ॥ చెప్పెడిదేమొ చెప్పితిని - జేటుసుమా యిఁక ఘోరకృత్యము
న్దప్పక చేసి చూపెదను - దారియు డొంకయు లేని కొండలం
దిప్పెద ముండ్లకంపగల - తిన్నెలపై కెగఁ బ్రాకెద న్మనం
బొప్పక యింతదాక నిటు - లోర్చితిఁ జత్తువు చూడు దుష్టుఁడా!

తుల:- పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా?

వృద్ధు:- అటులైన వదలుము

తుల:- వదలను.

వృద్ధు:- వదలవా? (వృద్ధుండు దాసు నీడుచుని పోవుచుండ దాసు రక్త సిక్తాంగుడై పడిపోవును)

వృద్ధు:- (తిరిగి చూచి) పడిపోయినాడు. పరమ వైరాగ్యమూర్తి. ఔరా! నేనెంత కఠినాత్ముండను. లోకు లీతని నిశ్చల భక్తిని జూచి నేర్చుకొందురుగాక! రామ నామ స్మరణానందాబ్ధి నోలలాడు మహాత్ములీ మాయా ప్రపంచ భోగముల విశ్వసింపరుగదా.

సీ॥ గంగానదీ తరం - గములం దూగెడి హంస
కాంక్షించు నేవండుఁ - కాలువలను
పారిజాత మరంద - ధారల్గ్రోలెడి మధు
కరము పోవునె ముండ్ల - కంచియలకు
అరయఁ జూతకిసల - యాస్వాదమై చొక్కు
కోకిల కొండ గో - గులకుఁ జనునె?
మదకుంభి కుంభస్థి - మస్తిష్క మాసించు
కంఠీరవము గడ్డిఁ - గఱచునొక్కొ?
గీ॥ గురుపదంబులు మది నమ్మి - గురిని నిలిపి
యాత్మ పరమాత్మ లోన నై - క్యం బొనర్చి
యఖిల తత్త్వ మహానంద - మనుభవించు
సిద్ధులీ కంపుటొడలి కా - శింతు రొక్కొ?

(జాతి చాటున కేగును)

తుల:- (కష్టముతో లేచి) ప్రాప్తిలేనిచోట ఫలము దక్కదు. నా పాపఫలము నే ననుభవించుచున్నాడను. కాదేని భక్తాగ్రేసరుండగు ప్రభంజన తనూజుండు నన్ను బాధించునా? శరీరమంతయు గాయములతో నిండినది. ఛీ! యింక జీవించుట పరమ నీచము

సీ. ఎవ్వాండు పుట్టిన - యేడవ దినమునఁ
బండని సూర్యుని - బట్టి మ్రింగ

నెవ్వాఁడు మంత్రియై - యే హానిలేక సు
గ్రీవు జీవంబులఁ - గావఁ గలిగె
నెవ్వాఁడు జానకి - నెఱిఁగి యుంగర మీయ
వారిధిఁ గాలువ - పగిది దాఁటె
నెవ్వాఁడు సౌమిత్రి - చివ్వలో మూర్ఛిల్లఁ
జిన్న చెండువలె సం - జీవిఁ దెచ్చె.

గీ. నెవఁడు రామ లక్ష్మణులకు - నెగ్గుచేయఁ
దలఁప పాతాళ దైత్యుల - తలలు తఱిగె
నట్టి వీరాంజనేయుని - బట్టుకొనియు
వదలినాఁడను జీవచ్ఛ - వంబువోలె.

తల పగులునట్లు ఱాతికిం గొట్టుకొని చచ్చెదఁగాక.

(కొట్టుకొనఁ బోవును)

(హనుమంతుఁడు నిజ రూపముతో ప్రత్యక్షమగును)

హను:- భక్తవతంసా! ఆగు మాగుము.

మ. పుటపాకంబునఁ గాంతి హెచ్చు కనకం-బుంబోలె నేనెన్ని సం
కటముల్వెట్టినఁగాని నిశ్చలముతోఁ - గంజాక్షు దర్శింపఁగా
బటు దీక్షన్వహించితీవు భళిరే - భక్తా! మహానంద మిం
కెటులైనన్ రఘురాము దర్శనము నీ - కిప్పించెదన్ నమ్ముమా!

తుల:- మహాప్రసాదము.

[తెఱ వ్రాలును]

స్థలము - ఒక పల్లె ఇద్దరు భటులు కత్తులు నూఱుచుందురు.

ప్ర. భటుఁడు:- ఇయ్యాళ నువ్వు సెప్పుతింటావో లేదో కానీ వాయాల నా కత్తికి బలే పదునొచ్చిందిరా. రాచోరి పిల్లో మరి ఓరి పిల్లోకాని ఒకే బలేచక్కగుందట. మూడొరే నా కత్తి పదును. యమకింకరుఁడి నాలికున్నట్లుందిరా!

ద్వి. భటుఁడు:- నాకత్తి చూడరా యమధర్మరాజు కోఱల్లె తళతళ మెఱుస్తుంది.

ప్ర. భ:- గంగానమ్మ జాతర్లకు సుళ్ళకు మా తాత ముత్తాతలు

వాడినకత్తి మాయింట్లో ఒకటి బలేదుంది గాని నే నెత్తలేక మూల పడేశారా. దొర మాచెడ్డోడురే. ఇక్కడే జాగు చేత్తుండావు. మన చావు మూడేను. పులిగాడు పోయి గిలి గాడు పట్టుకొంటాడు.

ద్వి. భ:- ఒరే! చావు అంటే నీకెంత భయంగా ఉందో వాళ్ళకంతే గదరా?

ప్ర. భ:- తప్పెవరు చేయమన్నారురా చిట్టోడా? గుడ్డొచ్చి పిల్లనెక్కిరిచ్చినట్టు మాట్లాడావే ఇయ్యాళ చక్కని పదుచు పిల్ల చిక్కని సిత్తురు బెల్లప్పానకం లాగా కమ్మని పుట్టతేనెలాగా నా ముద్దుల కత్తి ముచ్చటగా రుసిసూత్తది.

ద్వి. భ:- తప్పో ఒప్పో దేముఁడెఱుగు ఓరి మొద్దూ! ఆమెను తాకడానికి కూడా మనకు ఆజ్ఞ లేదురా? ఆమెను ఆమె మగఁడే చంపవలెనట.

ప్ర. భ:- అయితే అదేఁదో తెలుసుకోవాలి పోతాము పద.

ద్వి. భ:- ఏమి పోతామో. అందఱము పొయ్యేవాళ్ళమే. నా కర్మము నాకీ వృత్తి యెందులకు దాపరించినదో. వాళ్లేమో పరమ భక్తులంట అన్నదానం చేత్తారఁట అన్నం దినగానే ఒక ముసలోడు చచ్చాడఁట వాడి దగ్గఱ డబ్బున్నదంట. విషం పెట్టి చంపారని రాజుగారు పట్టుకొన్నారట.

ప్ర. భ:- శాత్రపురండాలు బహుచెబుతా. తనకులేని దానాధర్మం. నీగుండె దడాదడా కొట్టుకుంటుందే, శాస్త్ర కల్లేసుకుంటావా? పదరా! యాళైంది. పద. (నిష్క్రమించుచున్నారు)

(ఇది ప్రవేశకము)

తృతీయరంగము

స్థలము - చెఱసాల

వా: మ:- (బంధింపఁబడి) దుర్విధీ! కష్టముల నన్నింటిని గేంద్రీకరించి నాపైకిఁ బంపుచుంటివా? ఇంకేదయైన మిగిలియుండెనా?... లేదు. నిష్కారణ నరహత్యా దోషంబు నా మెడకుఁ జుట్టుట

కన్న నింకేముండును. తలిదండ్రులారా! ఆనాఁడు నా భర్త నన్నెడబాసినందులకే యెంతో చింతించితిరే. ఈనాఁటి నా దురవస్థను జూచిన మీ గర్భము లెట్లుండునో? అత్తమామలారా! మీరు స్వర్గములో నుంటిరా ! నా యవతారమును గాంచుటకు మీకు దివ్యదృష్టి కలదుగదా ! అయిన దేవతలకుఁ జెప్పి నాకుఁ జేతనైన సాయముఁ జేయింపుఁడు. దీనురాలను. దయరాదా? నాథా!... నాథా ! యెచ్చట నుంటివి. నీ దర్శన భాగ్యము కలుగునా ? సర్వ సర్వం సహా సామ్రాజ్యమును శాసించు సార్వభౌముని తన చెప్పుచేతలలో నడపించునట్టి యాత్మారామునకుఁ గోడలినై హరి నామ స్మరణ సుధాపాన భక్త శిరోమణి యగు తులసీదాసుగారి కర్ధాంగినైన నాకా యీ దుస్థితి. నేను చేసిన దోషమెద్ది? దైవమా! అబలను. ఏపాప మెఱుంగను. భారత వీరనారీ వతంసుల పవిత్ర జీవిత చరిత్రలకుఁ జంద్రునకుఁ మచ్చవోలెఁ గళంక మాపాదించుటకా నేను జన్మించినది. తల్లీ! భారత మాతా! నిరుపమాన శీలవతివైన నీ బిడ్డలకు గతియేమి? నిలువునఁ గన్నీరుఁ గార్చుచుంటివా? ధర్మము నశించుచున్న దనియా? లేదు...... లేదు. నవయుగ సందేశమునకై భగవంతుఁ డవతరింపఁగలఁడు సత్యము జయించును ధర్మ నిర్ణయము భగవంతునకే వదలెద.

చ. కదలవు నీ ప్రభావమునఁ - గాని సమస్త చరాచరంబు లీ
వదయతఁ గన్ను మూసిన న - జాండము మూఁతపడున్ [క్షణంబులో
హృదయమునందు నీపటము - నే లిఖియించి స్తుతించుదాన నన్
బదిలము సేయఁగాఁ దగిన - భారము నీయదిసుమ్ము మాధవా!

ఉష్ణ మండలములోని యుషఃకాలమువలె సాయం సమయపు టింద్రచాపంబు రీతి మాభాగ్య భోగంబులు క్షణ క్షణంబును మార్పుచెంది చివఱ కీదశ సంప్రాప్తించినది. రామా! భక్త

కల్పద్రుమా! నిన్ను నమ్మినందుల కిది ఫలమా! మేమీ భూమికి భారమా! స్వామీ! నా కర్తవ్యమును దెలుపవేమి? నా రోదన మరణ్యరోదనము కావలసినదే?... పాహిమామ్.

(కన్నీరు గార్చుచు నిమీలిత నేత్రయై యుండును. పైనుండి పూలు రాలును)

[తెఱ వ్రాలును]

స్థలము - ఆశ్రమ ప్రదేశము

హనుమంతుఁడు:- (ప్రవేశించి) అగ్ని పరీక్ష సలుపుచున్న నీ దంపతులు లోఁగలేదు స్థిర సంకల్పులు దైవ సమానులు. అసిధారా వ్రతమునకైన నలవడుచున్నారు. కాని పట్టిన పట్టు వీడలేదు నా పన్నిన మాయాజాలమునకు వెఱచి తమ భక్తిని మానలేదు ఇంక నేను జాగు చేయు టుచితముకాదు. క్లిష్ట పరిస్థితులను జవఱకుఁ దెచ్చితిని. ప్రాణాపాయములు జరుగఁబోవుచున్నది ఇది యంతయు భగవంతుని పరీక్ష. ఈ పరీక్షలో నీ పుణ్యదంపతు లుత్తీర్ణులగుచున్నారు. నేను వైకుంఠమున కేగి లక్ష్మీనారాయణులు సీతారామ రూపములతో వీరలకు దర్శనమిచ్చునట్లొడంబఱచితి. ఇంతవఱకు దయ సేయని కారణ మేమై యుండనోపు నా తోకను బెంచి వైకుంఠమునకుఁ బంపి భగవంతుఁడున్న మందిరమునే పెకలించుకొని వచ్చునట్లు చేసెద. (తోఁకను ముద్దుపెట్టుకొని) వాలమా!

సీ. అలనాఁడు రావణు - నాస్థానమందు నా
కానంబుగ నీవ - యమరియుంటి
పట్టి రక్కసు లగ్గి - పాలుచేసిన యంత
గడియలో లంకను - గాల్చియుంటి
పాతాళ లంకాధి - పతులు జేవికిఁ గీడు
తలఁపఁగ గోటగాఁ - దనరియుంటి
సౌమిత్రి మూర్ఛిల్ల - సంజీవ నగము నూ
గించి చయ్యనఁ బెక - లించియుంటి

గీ. వాలమా! నేఁడు వైకుంఠ - పట్టణమున
కేఁగి మాధవు సదనంబు - వేగఁ జుట్టి
రాముఁ దోడ్కొని రమ్ము బి - రానఁ బొమ్ము:
భక్తునకు సాయ మొనరింపఁ - బాడిగాదె?

(తోఁకను విసరివైచును. అది ధ్వనితో వేగముగఁ బోవుచుండును)

హను:- వాలమా! చుట్టితివా? ఇఁక నూఁపెదఁగాక.

(తోఁక నూపును)

(పైనుండి దివ్యమైన తేజస్సు హనుమంతునిపై విద్యుద్దీపపుఁ గాంతివలెఁ బ్రసరించుచుండును)

ఆకాశమున:- ప్రభంజన తనూజా! భక్త రక్షణమునఁ బ్రాలు మాలితి ననుకొంటివా? లేదు. లేదు.

హను:- (పైకిఁజూచుచుఁ జిఱునగవుతో నమస్కారముచేయుచుండును)

[తెఱ వ్రాలును]

(ఇది విష్కంభము)

## చతుర్థరంగము

స్థలము - శ్మశానము

తులసీదాసు:- (వెలుతురుకట్టె వెలిగించుకొని కమండలువుతోఁ బ్రవేశించుచున్నాఁడు) రాజులకుఁ గాలి దివిటీవలె నీ వెలుతురుకట్టె సాయమున నేనిప్పుడింత మార్గము రాఁగలిగితిని. (పైకిఁ జూచి) సప్తఋషులు పశ్చిమ దిశకుఁ బ్రవేశించినారు. ఆహా! యర్థరాత్రి మైనది. అదియే శ్మశానవాటిక కాఁబోలు. జీడి విత్తనములఁ గాల్చు మంగలములవోలె నప్పుడప్పుడు గుప్పు గుప్పున నల్లని పొగ వదలుచు నందందుఁ గాష్ఠములు గాలుచున్నవి. ఈ వెలుతురుకట్టె కాలి కాలి పట్టుకొనుటకు వీలులేకున్నది. ఏకట్టెయందు నిప్పున్న యాకట్టెయే కాలును. (పాఱవైచి దానివంకఁ జూచి) బంధు ప్రేమ యింతేకదా. ఉపయోగ పడు నంతవఱకే ప్రపంచ గౌరవము. ప్రకృతికిని బరమాత్మకును గల సంబంధము దుర్భేదము, బేతాళుండు

భూతములతో నిచ్చట సంచరించుచుండునని ప్రతీతి వారిని దర్శించి నా కడపటి ప్రయత్నమును గట్టిగాఁ జేసెద. (నడచి) ఇదియే శ్మశానము. భయానక బీభత్స రసముల కాటపట్టు. ఉజ్ఝిత రక్త కపాల మాలియగు మహాకాళి వీర విహారము సల్పుచున్నట్లుండును. ఎవరక్కడ?... పలుక రేమి?... ఆఁ! భూతము కాదుగదా? కాదు. నా మనస్సే పెనుభూతము (సమీపించి) ఓహో! మట్టికొమ్మను నీడకొఱకై నాటినారు. రజ్జు సర్ప న్యాయము.

సీ॥ ఇచ్చోట నెట్టి క - వీశుల రత్నాల
గంటముల్మంటలోఁ - గలసె నొక్క
ఇచ్చోట నేయేన - రేంద్రుల చిహ్నముల్
కాలి బూడిద యయి - క్రాలె నొక్క
ఇచ్చోట నేకళ - లచ్చొత్తు కుంచియల్
మెఱుపుఁ దీఁగల మాడ్కి - మెఱసె నొక్క
ఇచ్చోట లలితహా - నే మహా వాద్యముల్
కరఁగి మట్టిగ మాఱఁ - గలిగె నొక్క

గీ॥ ఇచట దయ్యాలతోఁ బర - మేశ్వరుండు
భస్మ వేదికపై నాట్య - పటిమఁ జూపు
ధర్మమే తోడు దీనిని - దాఁట లేఁడు
వసుధ మానవునకుఁ గీఁడు - వల్ల కాడు.

మ॥ ఇట రవ్వంతయు హెచ్చు తగ్గులకుఁ జో - టే లేదు రారాజుతో
భటుని న్బిబ్బులితోడ మేక నొక క్షే - వం బెట్టి జోకొట్ట యూ
రట కల్గించెడి జన్మ జన్మమున వై - రాగ్యంబుఁ బుట్టించు నిం
కిట నస్పృశ్యత ధర్మ నిష్ఠకయి తా - నే బుగ్గియై పోయెడిన్.

గుడ్లగూబల సంగీతమునకును జితులలోఁ దలలు చిట్లు చిటపట మోఁతలనెడి మృదంగ ధ్వనులకు భూతముల భరత నాట్యమునకు నక్కల స్వసి వాచకములకుఁ జక్కఁగ సరిపోయినది. గంతకుఁ దగిన బొంత. ఇది సృష్టి వైచిత్ర్యము (వినుట నభినయించి) ఎచ్చటదీ యార్తనాదము.

(మమతాదేవి భటులు ప్రవేశించుచున్నారు)

మమ:- అయ్యలారా! యింకెచ్చటికిఁ గొనిపోయెదరు?

ప్ర. భ:- అల్లదిగో ఆ బండదగ్గిరికి. నిన్నక్కడ పెట్టి నీ మొగుణ్ణి లాక్కొత్తాం.

మమ:- ఓ ధర్మదేవతా! నీవీ లోకములో లేవా?

తుల:- (సమీపించి) ఓయీ మీరెవ్వరు?

ప్ర. భ:- మామోరైతే నీకేమి? తులసీదాసు కొఱకు చూత్తుండాము.

తుల:- అటులైన నేనే తులసీదాసును.

ప్ర. భ:- ఎతకబోయిన తీగి కాళ్ళకు సుట్టుకుందిరా. నువ్వు సెప్పరా.

ద్వి భ:- అయ్యా! మీ మఠములో నీమె యొక వృద్ధుని ధనము కొఱకు విసముఁ బెట్టి జంపినదని యీమెకు రాజుగారు మరణదండన విధించినారు నీవును దోషివేసట. నీ వీమె తలను నఱికి రాజుగారికిఁ జూపవలెనట. అదిగో వధ్యశిల. ఇదిగో ఖడ్గము. మేముండవలసిన చోటికు మేము పోయెదము.

(నిష్క్రమింతురు)

తుల:- (సమీపించి) సతీ! మమతా!

మమ:- నాథా! (పతి వక్షంబున శిరంబు వాల్చి) ఈ దాసురాలి కడసారి వందనము లివియే.

తుల:- విధి విధానముఁ దప్పింపలేము. మానవతివైన నీకీ మానవహత్యాదోష మేల కలిగెను. నిజము చెప్పు మమతా!

మమ:- ఆహా! కాల వైపరీత్యము. మీరుఁగూడ నన్ననుమానించు చుంటిరా? సూర్య చంద్రులు లేరా? గ్రహములు మాఱినవా? నా యంతరాత్మ నశించినదా? మీ పాదసాక్షిగా నే నేపాప మెఱుంగను.

తుల:- నిర్దోషురాలైన భార్యను జేతులారఁ జంపవలయునా? ఆపైని నాగతి యెట్లు మాఱునో. సదా నా క్షేమమునకై పాటుపడుచుఁ గాలముఁ గడపిన నాతల్లి నిరంతర దివ్య తపో

నిష్ఠా గరిష్ఠుండైన నా తండ్రితో దివ్యలోకమున కేగుటకుఁ గొంత కొంత కలుగునేమో కాన నా తపః ఫలంబు మా యమ్మకు ధారవోయుదును. ఈ కమండలువుఁ దీసికొనుము.

మమ:- చిత్తము. (దాసు దోసిట నీరు పోయుచుండును)

తుల:-

మ. వనవాసంబునఁ బిత్ర భక్తుఁడనై - వైరాగ్యమున్పూని చే
సిన యా శ్రీ రఘురామనామజప సు-శ్రేయంపుఁ బుణ్యంబు నా
జనకుం డేగిన లోకమేగుటకునై - సంతోషచిత్తంబుతో
జననీ! నీకిదె ధారవోసితిని గా - సల్యాత్మజున్ సాక్షిగా!

తులసీదాసూ! నీవు మిక్కిలి పాపాత్ముఁడవు. కాకున్న నీకీ కర్మమేమి? ఇఁక నీ నిర్భాగ్యునకు శ్రీమహావిష్ణువును దర్శించు యోగ్యము కలదా? అది పొరపాటు. ఆ మహానుభావుఁడు కన్నుఁ దెఱచెనేని యెంతసేపు? సతీ!

సీ. నీ రక్తిచేఁ గదా - వారకాంతలఁ బాసి
గార్హస్థ్యమున నుండఁ - గలిగినాఁడ
నీ యుక్తిచేఁ గదా - నిక్కెడి వైరుల
సామంత రాజుల - నలిపినాఁడ
నీ శక్తిచేఁ గదా - యాశలన్నియుఁ ద్రెంచి
పరమాత్మపై దృష్టి - బఱపినాఁడ
నీ భక్తిచేఁ గదా - నిఖిల ధనాదులఁ
బేద సాదులకు న - ర్పించినాఁడ

గీ. నీదు సుఖములకుఁ దులసి - నీళ్ళు విడచి
యన్యథా శరణంబిఁక - నాస్తి యనుచు
నన్ను నమ్మి కృశించెడి - నిన్నుఁ జంపఁ
జేతులాడవు నేనేమి - సేతు మమత!

మమ:-

శా. సందేహించుట పాడిగాదు ప్రియుఁడా - సత్యార్థియై శ్రీ హరి
శ్చంద్రుండంతటివాఁడె చంద్రమతిఁ దా - శాసించి ఖడ్గాహతిన్

మఱిందింపం దలపెట్టఁడే త్రిదిన సా - మ్రాజ్యంబు మీచేత నా
కెందుందక్కను గాన నేడ్చి ఫలమే - మీ? నన్ను ఖండింపుఁడీ.
కర్మవీరులమై భక్తి యోగంబున మోక్ష సామ్రాజ్యంబు వడయఁజూచు మన మీ తనువులకై తల్లడిల్లుట ధర్మమా? చిచ్చుఱ పిడుగులు మంచుగడ్డలై పోవా? ఖడ్గ ప్రహారములు పూవి సరులు కావా? ఇదిగో వధ్యశిల నారోహించుచున్నాను.

తుల:- రాజ శాసనము నుల్లంఘింపరాదు. (ఖడ్గమును సవరించును)

తెఱలో - చంపఁ దగదు. చంపఁ దగదు. వారు నిర్దోషులు.

తుల:- సతీ! నీవింకఁ గడపారి భగవంతుని బ్రార్థించుకొనుము

మమ:- ఓ జగత్ప్రభూ! మాకు జన్మ రాహిత్యమొనగూర్చి నీలో నైక్యముఁ జేసికొనుము.

మ. కలకాలం బొకరీతి సౌఖ్యములు గ - ల్గంబోవు కష్టంబులున్
నిలువం జాలవు రెండునుం గలిసి రా - నే వచ్చు నొక్కప్డు వె
న్నెలయుం జీఁకటి యట్ల యెట్టులును వా-నిం దాఁటఁగా లేని కా
మలతాబద్ధుల ముద్ధరింపు మిఁక రా - మా! భక్త కల్పద్రుమా!

తుల:- సతీ! నీ మృదు మధుర భావంబులు, నీ శిరీష కుసుమ సదృశ సుధామయోక్తులు, నీ నయ వినయాది సద్గుణంబులు నీవిశ్వ మానవ సోదరత్వము నీ నిరహంకారము లోకము గుర్తింపఁ గలదా? ఈ ఘోర నిందా భూతము దయా శూన్యమైన ప్రాణవాయువుల నపహరింపఁబోవుచున్నది. ఇంక నాకెట్టి కష్టములు రానున్నవో. మమతా! విశ్వమానవ కళ్యాణో ద్దిష్ట సందేశ సంకలితమైన నీ దివ్య గానామృతమును నేనింకఁ గ్రోలఁగలనా? ధర్మములను బేరుతో నధర్మములు సదాచార ములను బేరుతో దురాచారములు ప్రబలిన యిక్కాలమందు నిరంతర సంస్కరణాసక్తవగు నీ ఋజు మార్గమును నీ సత్య ప్రబోధమును నీ పవిత్ర హృదయమును నేనెట్లు చాటఁగలను? నీ గళమునఁ బుష్పమాలను వైచిన యీ హస్తముతో నే కఱకు కత్తినిబూని నీతలఁ దెగనఱుకవలయునా? సాకారో

పాసనాయత్త చిత్తులమై పరితపించుచున్న మన వంశము నేఁటితో నాశనమగుచున్నది. అస్మదీయ విజయానందాంకిత ధీర ఝాంకరణంబు సర్వ దిక్కటాహంబుల మాఱు మ్రోగిం చుటకై నా సమస్త శక్తులను ధారవోయుదును. రామా!

మ. అరిషడ్వర్గముల న్జయింపఁ గల ధై - ర్య స్థైర్యముల్లేమి నా
గురువుం దైవము తల్లి దండ్రివగు నీ - కున్నాలిఁ బుట్టింపఁ ద్వ
చ్చరణంబుల్ హృదయాబ్జ పీఠమునఁ బొ-ల్చన్నిల్పి పూజించి నీ
మరుఁగ్రుంఁజొచ్చెదఁ గావవయ్య రఘురా-మా! భక్తకల్పద్రుమా!

మ. ఇలపైఁ గల్గు సమస్త జీవుల నరుం - డే శ్రేష్ఠుఁడంచెంచి ని
శ్చల విజ్ఞాన ధురంధరుల్ విజయ వా - చారూఢి ఘోషింపఁ ద
త్ఫల మేమున్నది నాదు బుద్ధి నిను బొం - దంజాలు సద్ధర్మ ని
ర్మల వైరాగ్యము నందలేనియెడ రా-మా! భక్త కల్పద్రుమా!

శా. అన్నా యేటికి జాగు సేసెదవు మా - యాలోక బద్ధుండనై
నన్నే నే నెఱుఁగంగ లేక బహు చిం - తన్బొక్కి నీ పాదముల్
కన్నీటఁ గడుగంగ నెంచితిని వీ - కన్నీవు పశ్చాత్తుమై
మన్నింపందగు నాదు పాపముల రా - మా! భక్తకల్పద్రుమా!

తుల:- ఓ ఖడ్గరాజమా! నీవు పతివ్రతా శిరోమణుల రక్తపానముఁ జేయఁ దలంచితివా? మంచిది.

(దాసు కత్తినెత్తఁగా నాంజనేయుఁడు పట్టుకొనును. దివ్య తేజముతో సీతారాముల దర్శన మగును)

తుల, మమ:- నమో...... నమో కృతార్థులము.

శ్లో. సత్యానంద మయం ప్రశాంత హృదయం సర్వాత్మ
[సంధాయకమ్
నిత్యం నిర్మల యోగ దీప కళికం నీరేజ పత్రేక్షణమ్
భవ్యం భక్త జనాశ్రయం భవహరం భద్రాత్మకం భావుకమ్
సీతా హృత్సరసిరుహాంబర మణిం శ్రీరామ చంద్రం భజే.

శ్రీరాముఁడు:- భక్తులారా! లెండు తులసీదాసూ! నీవు హిందీలో రామాయణమును రచింపుము. మిమ్ము సేవించుచున్న

కనకాందికిని మధుకరభట్టునకును దరించు మార్గముఁ జెప్పుడు.
కడకు మీకు మోక్ష మొసంగెదను. మీ కష్టము లన్నియు
నేను కల్పించిన మాయలు. ఇంకేమి కావలయును?

తుల:- మీ దర్శన భాగ్యముకంటె మా కింకేమి కావలయును?
అయిన నిట్లగుఁగాక!

ఉ. ఏరికిఁ బాడి పంటలు స - మృద్ధిగ నుండునుగాత! విద్యలన్
నేరిచి సర్వమానవులు - నీతిగ నుందురుగాత! స్త్రీలకున్
గౌరవ మెచ్చుగాత కల - కాలము హైందవ సత్యదీక్షచే
భారతమాత దాస్య మెడ - బాసి సుఖాంబుధీ నోలలాడుతన్.

సీతారాములు:- తథాస్తు.

మంగళమ్



జయలక్ష్మి ప్రింటర్సు, చీరాల.

